# ఉత్తరాలు

### సినిమా

3—5—74 సంచికలో శ్రీ ఎం. ఎస్. మిరాజా గారు హిందీ సినిమాలు గురించి చేసిన వ్యాఖ్య సమంజసంగా లేదనిపిస్తోంది. కేవలం భాష కారణంగా హిందీ సినిమాలు ఇతర రాష్ట్రాలలో కూడా నడుస్తున్నాయనడం శోచనీయం. చిత్రాలు ఏ భాషవయినా, అన్ని చిత్రాలు ఎప్పుడూ బాగుండవు. మంచి కథా సంవిధానంతో కూడిన చిత్రం ఒకటయినా మన తెలుగులో ఈ మధ్య వచ్చిందని చెప్పుకుంటే, నిజంగా తెలుగువారికి గర్వకారణమే! మనకున్నదల్లా, ఒకేరకం కుటుంబగాథలు, చౌకబారు సన్నివేశాలతో కూడిన అపహాస్యకష్టాలు, ద్వంద్వార్థాలతో కూడిన హాస్యం కన్నీటి త్యాగాలతో నిండిన సినిమాలు మాత్రమే సాంకేతికంగా బాగా మెరుగుపడితేకానుండా, ఎప్పో లోపాలతో, ఎప్పుడూ ఒకే మాదిరిగా నడిచే మన సినిమాలు చూడాలంటే నిజంగా "బోర్" కాదూమరి! ఎప్పుడయినా ఒకటి, రెండు మంచివి వచ్చాయంటే అవి పరభాషా చిత్రాలను అనుసరించి తీసినవే! ఇంక ఏ రకంగా "మనింటికనార' బాగుంటుందను కుని మురిసిపోవడం?

పి. జి. లక్ష్మి, పి. వి. రమణమూర్తి, (భువనేశ్వర్.)

### సినిమా బ్యాలట్

26-4-74 ఆంధ్రపత్రికలో, 'ఫిలిం బ్యాలట్'లో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ఉత్తమ నటుడుగా ఎన్నిక కావటం 'హాస్యాస్పదం' అంటూ శ్రీ డి. జి. జయప్రకాశరావు వ్రాసిన లేఖ చూశాను. ఇది మీరు ప్రచురించకున్నా ఫర్వాలేదు అన్నారు— అలా రాస్తే గాని వేయరని భయపడ్డారేమో పాపం. ఏది ఏమైనా మహా నటుడు అక్కినేని గురించి ఆయన అలా వ్రాయటం, అది మీరు ప్రచురించటం నిజంగా హాస్యాస్పదం.

టి. వై. బి. ఆర్. కుమార్
హైదరాబాద్—500020

* * *

15—3—74 "పత్రిక"లో మనలో మాట అనే శీర్షికలో సులోచనారాణి గారిని వ్రాస్తూ "ఆమె నవలలన్నింటికీ వెండితెరకెక్కే అవకాశం దక్కింది" అని వ్రాశారు. కాని ఆవిడ వ్రాసిన "ఆహుతి" నవలకు తెరకెక్కించడానికి ఇంక ఏ నిర్మాత పూనుకోలేదు కదా?

లతీఫొద్దీన్ అహమద్. (కుల్కానావాద్)

### తెలుగోడి గోడు

తెలుగోడు గోడులు ఎన్ని ప్రచురించినా ఆంధ్రులు ద్రోహానికి రారు అని చెప్పవలసి వస్తుంది. అలో చిస్తేయుంటే ఆ ఆంధ్రాకన్నా మా ఒరిస్సానే నయం అనిపిస్తూంది. కారణం, ఒరిస్సాలో రాష్ట్ర భాషతో కాక ఇంగ్లీషు, తెలుగు వుంటాయి. ఆంధ్ర రాష్ట్రీయులకు తమ మాతృ భాష, యందాసక్తి లేకపోయినా పొరుగు రాష్ట్రం ఒరిస్సాలో తమ మాతృభాషతో తెలుగుకు కూడా ప్రాధాన్యతనిస్తుంది. ఈ విషయము ప్రతి ఆంధ్రుడు ఆలోచించి ఇక నుండైనా తెలిసి తెచ్చుకోమని మనవి చేసుకుంటున్నాను. బి. త్రినాథరావు(రాయగడ)ఒరిస్సా.

### మినీకవిత

మినీ మినీ కవిత్వ గాలిలా వుంది
నేటి రచనా వ్యాసాంగం
వారపు పత్రికలో
మా కొద్దయిన్నాయి మెరుగు రచనలు
మినీ మినార్థంలోనే గట్టితనం రావాలి,
మనలో నున్న సామర్థ్యం చూపాలి
మినీ పేరులు రాయాలని ఇదే
మినీ కవిత!
మినీ రాని మినీ కవిత!

— మోయగ బాలసుబ్రహ్మణ్యం.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 31–5–1974
(శ్రీ ఆనంద నామ సం. వైశాఖ బ. ఏకాదశి
సంపుటము : *67* సంచిక *40*
స్థాపితం 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
*గాంధీనగరం, విజయవాడ-3.*
సంవత్సరం చందా – రు. 31–20 పై.
ఆరుమాసాల చందా – రు. 15–60 పై.
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక







# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**బలహీన వర్గాలకు సలహా.**

ఏప్రిల్ 30 న గాంధిభవన్‌లో జరిగిన అల్ప సంఖ్యాక బలహీన వర్గాల సమాఖ్య సమావేశం ప్రారంభించిన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు బలహీన వర్గాలకు చేసిన హితవు అన్ని వర్గాల వారు వినదగిందే. నాయకమ్మన్యుల చేతుల్లో పడి నలిగిపోవద్దని ప్రజా ప్రభుత్వం బలహీన వర్గాలు శ్రేయోభివృద్ధికై నిర్వహిస్తున్న ప్రణాళికలను పరిశీలించవలసిందని ఆయన కోరారు. కేంద్రమంత్రి శ్రీ భోలాపాశ్వాన్ శాస్త్రి అన్నట్టు భూమి సంస్కరణలు జరిగివుంటే హరిజనగిరిజనుల ఆర్థిక స్థిరత్వానికి కారణమయి వుండేవి అవి త్వరగా జరుగాలి.

**కుమారి పద్మ చిత్రాలు.**

సోవియట్ భూమి నెహ్రూ అవార్డు పొంది మే నెలలో సోవియట్ యాత్రకు వెళ్లిన పదకొండు సంవత్సరాల బాలిక కుమారి బి. పద్మ మే నెల 2, 3 తేదీలలో కళాభవన్‌లో రామాయణ చిత్రాలు ప్రదర్శించి ప్రేక్షకులను తన్మయులను చేసింది. ఈ బాలిక గోల్కొండ కేంద్ర పాఠశాలలో చిత్రకళా శాఖ అధ్యక్షుడు శ్రీ బి. ఎ. రెడ్డి కుమార్తె. ఆ పాఠశాలలోనే 6 వ తరగతి విద్యార్థిని. ఇంతవరకు 50 బహుమతులు పొందింది. రష్యా యాత్రకు ఎన్నికయిన నలుగురు బాలబాలికలలో ఈమె ఒకతె. శ్రవణ కుమారుని మరణంతో ప్రారంభమై, రాముని అయోధ్యాగమనంతో ముగిసే 30 రామాయణ వర్ణ చిత్రాలు జాతి సహజమైన భావనతో రమణీయంగా వున్నాయి. చిరంజీవిని పద్మభవిష్యత్తు ఉజ్జ్వలమని నిరూపిస్తున్నాయి.

**ఫ్రాంక్ మొరేస్‌కు బాష్పాంజలి.**

ఆంధ్రప్రదేశ్ పత్రికా రచయితల యూనియన్ మే 4 వ తేదీ సాయంత్రం దేశోద్ధారక భవనంలో అత్యవసర సమావేశం జరిపి, ప్రముఖ పత్రికా రచయిత శ్రీ ఫ్రాంక్‌మొరేస్ మరణానికి సంతాపం తెలిపింది. ఆయనని టైమ్స్ ఆఫ్ ఇండియా, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌ల సంపాదకుడుగా, గ్రంథకర్తగా తన నిర్భీక విమర్శతో పత్రికా రచనకే గౌరవం తెచ్చారని పలువురు జోహార్లర్పించారు. ఆయన కుమారుడు శ్రీ డాంమొరేస్ ప్రముఖ ఆంగ్ల కవి.

**రొట్టె సంగతి.**

మాడర్న్‌బ్రెడ్ పాటలు రేడియోలో, మాటలు పత్రికలలో విని కని విసుగెత్తిపోయినా, బజారులో సరసంగా దొరికితేనన్నా బాగుండును. ఇతరబ్రెడ్స్ కంటే, సరసంగా, ఆరోగ్యంగా, పరిశుభ్రంగా ఇది దొరకడంకదా ప్రభుత్వం ఉద్దేశం. మార్చి నెలనుండి దీనిధర పెరిగి నేడు రు. 1—10 అయింది. అదిన్నీ, సరిగ్గా దొరకదు. ప్రభుత్వం జనానికి ఒక ఆహార పదార్థం అలవాటుచేసి, దానిని సరిగా, సకాలానికి సరసమైన ధరలకు సరఫరా చేయకపోతే ఏమంటాము.

**పాపం.**

భారత సైన్యం తాత్కాలిక ప్రధానాధికారి లెఫ్టినెంట్ జనరల్ ఎం. ఎల్. థావన్ మే 3వ తేదీన మిలిటరీ ఎలెక్ట్రికల్, మెకానికల్ ఇంజనీరింగ్ కాలేజి (తిరుమలగిరి) స్నాతకోత్సవంలో ప్రసంగిస్తూ, పట్టభద్రులు తమ వృత్తికి ఆత్మగౌరవం సంపాదించి, అనుదినం జరుగుతున్న సాంకేతిక శాస్త్రాభివృద్ధిని ఎప్పటికప్పుడు తెలుసుకొంటూ ఉండాలని హితవు చెప్పారు. పాపం ! విద్యా విధానం మారాలని, విద్యార్థులు క్రమశిక్షణ అలవరచుకోవాలని, మంత్రులు లాగ ఎందుకు చెప్పలేదో ! అబ్బ ! ఒకరి నుంచైనా, అలాటి మాటలు వినకపోవడం హాయిగా ఉంది. ఈ పరోపదేశ పాండిత్యం వినివిని విసుగెత్తిన వీనులకు.

**కృష్ణ అభిమాన సంఘం.**

సినీ హీరో కృష్ణ అభిమాన సంఘం జంటనగరాలలో తొలిసారిగా శ్రీ కొత్త దేశపతిరావు అధ్యక్షతన ఏర్పడింది. కృష్ణ ఉన్నత నటన ప్రమాణాలను ప్రేక్షకులు తెలుసుకొనేట్టు చేయడం, రాష్ట్రం లోని కృష్ణ అభిమాన సంఘాలను సమీకరించడం, కృష్ణ చలనచిత్రోత్సవాలు జంట నగరాలలో నిర్వహించడం ఈ సంఘం లక్ష్యాలు. శ్రీయుతులు ఈరంకి సీతా

## యువతరం



ఏదారు సార్లు ఆంధ్రోద్యమంలో అరెస్టయి సబ్ జైలు గాలిపీల్చిన ధైర్యశాలి యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్. అదే సందర్భంలో ముషీరాబాద్ జైలు కూడా ఓ నెల రోజులు వాస యోగ్యంగా వుందా? లేదా? అన్నట్లు చూశాడు.

ఉపాధ్యాయుల సమ్మెలో వారికి చేయూత నిచ్చిన యీ విద్యార్థి నాయకుడు స్నేహితులందరికీ "వై. ఎల్. పీ."గా పరిచయం.

క్రికెట్ ఆడడు కాని కామెంటరీ అంటే చెవికోసుకుంటాడు. సిగరెట్‌లు కాలుస్తాడు కాని అలవాటు లేదుట! హిప్పీ వేషాలంటే అయిష్టం. నాటకాల్లో వేషాలు వేయడం యిష్టం. బహుమతులుకూడా పొందాడు. ఎన్. టి. రామారావు అంటే అభిమానం. హిందీలోకూడా పరీక్ష పాసయ్యాడు. బి. ఏ. చదువుకుంటున్నాడు గుడివాడ ఏ. ఎన్. ఆర్. కళాశాలలో. ప్రేమించి పెళ్లి చేసుకోవాలని వుంది.

ఛాన్సు దొరికితే సినిమాల్లోకి వెళ్లాలీ అని వుంది. గవర్నమెంటు ఉద్యోగం మాత్రం చేయనని మొదటే శపథం పట్టేస్తున్నాడు. [అసలు వాళ్లిస్తారా? అంత సుళువుగా అని.]

వరే "వేశ్యలకు లైసన్సులు యివ్వాలని" ఓ సారి రేడియో ప్రసంగంలో చెప్పాట్ట! రేడియోలో ప్రసంగాలు కూడా చాలా యిష్టం. రాజకీయాలలో భాగస్వామ్యం తీసుకున్నా స్వతంత్రుడుగా వుంటాడే కాని అధికార పక్షంలో చేరడు. [పీరాజీ]

---

రామయ్య ప్రధాన కార్యదర్శి, పి. ఎస్. మూర్తి కోశాధికారి, తిరుమలరామచంద్ర, జి. రామమూర్తి, జి. రామారావు, పి. లక్ష్మణరావు, ఎం. కృష్ణమూర్తి మజ్జి శ్రీనివాసశర్మ కార్యవర్గ సభ్యులు.

**ఉపశ్రుతి:**

"ఏం సార్ ఈ ముసలితనంలోనూ ఉచితంగా కళాసేవకు పూనుకొన్నారు?" అన్నారు ఒకరు. "మరి అలాటి గుణ శేఖరులు లేకపోతే లోకం ఏమవుతుందంట!" పక్కవారి జవాబు.

సీరియల్




"గుడీవినింగ్ అంకుల్!"

తియ్యటి కంఠం వీణ మీటినట్టుగా, కోకిలలు కువకువ లాడినట్టుగా మృదుమధురంగా వినిపించే సరికి,

స్టూలేసుకుని, పైకెక్కి, గోడకి సీనరీ తగిలిస్తోన్నమధు, తలెత్తి గుమ్మంవైపు చూసాడు.

చిరునవ్వులు చిందిస్తూ, అపరంజి బొమ్మలా, తలుపుదగ్గర నిలబడుందో టీనేజ్ అమ్మాయి.

మధు సిగ్గుపడి, వెంటనే తడబడుతూ, స్టూల్ మీంచి క్రిందకురికాడు.

"ఎక్స్క్యూజ్ మీ ఫర్ ది డిస్టర్బెన్స్. ఏదో పనిలో ఉన్నట్టున్నారు" అందా అమ్మాయి, నొచ్చుకుంటూ తిరిగి.

అప్పటికి కొంచెం తేరుకున్న మధు, "ఇట్సాల్‌రైట్; ప్లీజ్ కమిన్" అంటూ లోపలి కాహ్వానించి, కుర్చీ చూపించాడు.

ఆ అమ్మాయి లోపలికొచ్చి ఎదురుగాఉన్న కుర్చీలో కూర్చుంది.

మధువంక చూసి, స్నేహ పూర్వకంగా నవ్వింది. —"నేను యింటిగల వారమ్మాయిని. నా పేరు సుషమ. బి. ఏ. చదువుతున్నాను" అంటూ తనకు తాను పరిచయం చేసుకుంది.

ఆ అమ్మాయిని చూస్తుంటే, ఏ శిల్పో అతిప్రయాసతో మలిచిన అపురూప శిల్పం కాదుగదా అనిపిస్తోంది. తీర్చి దిద్దినట్టున్న అవయవాలతో తెల్లగా పాలరాతి ప్రతిమలా ఉంది. వయస్సు పద్ధెనిమిదేళ్లుండవచ్చు. జీన్స్ వేసుకుంది. వదులొదులుగా ఉన్న రెండు జడలు, సగానికల్లి వదిలేసింది.

"ఇవ్వేళ మీరు మాయింట్లో దిగుతున్నారని తెలిశాక, మనిషినైతే కాలేజీకి వెళ్లాను గాని, మనస్సంతా యిక్కడే ఉందనుకోండి. వెళ్లింది లగాయితు, ఎప్పుడింటికొచ్చేసి, పరిచయం చేసేసుకుందామా అని, ఏక కొట్టుకు పోయా. ఆ వేళ యిల్లు చూసుకోడానికి మీరొచ్చినప్పుడు కూడ. నేనింట్లో లేను.

కాలేజీ నుంచి రాగానే అమ్మ చెప్పింది.— మీరు దిగిపోయారని. అంతే. పుస్తకాలక్కడ పడేసి, వెంటనే యిలా పరుగెత్తుకొచ్చా." చక చకా ఇంగ్లీషులో మాట్లాడేస్తోంది.

ఆ అమ్మాయి చొరవకు విస్తుపోయిన మధు, "అలాగా?" అన్నాడు – అంతకంటే యింకేం మాట్లాడాలో తెలీక.

"మాకు మద్రాసీ వాళ్లంటే ఎంతో యిష్టం. మా యింట్లోకి దక్షిణ భారతీయులు అద్దెకు రావడం యిదే ప్రథమం. నాకు చాలా సంతోషంగా ఉంది. ఎంత సంతోషంగా ఉందీ అంటే, నా ఆనందాన్ని మాటల్లో చెప్పడం నాకు శక్యం గావడంలేదు"

"కృతజ్ఞుణ్ని.' కాని మేము మద్రాసీవాళ్లం గాదు. ఆంధ్రులం. మిమ్మల్ని నిరాశపుచ్చి

ప్రారంభం!

ఉన్నట్టయితే, క్షమించాలి'' నవ్వుతూ అన్నాడు మధు.

చేపపిల్ల టపటపా కొట్టుకుంటోందా అనిపించేలా, ఆ అమ్మాయి నయనాలు క్షణ కాలం మిలమిలలాడేయి. "మద్రాసీలంటే ఎవరు ? ఆంధ్రులంటే ఎవరు ?— ఏమో బాబా! నాకదేం తెలీదు. నా దృష్టిలో మీరు మదరాసీలే — నాక్కావాల్సింది కంపెనీ; అంతే... మరి, మీారు కుటుంబాన్ని ఎప్పుడు తీసుకొస్తారా ?'' అంది.

మధు గతుక్కుమన్నాడు. "పన్నాం. నాకు పెళ్లే కాలేదు. కుటుంబాన్ని ఎక్కడ్నించి తెచ్చేది చెప్పండి—కొంపదీసి, వెంటనే యిల్లు ఖాళీ చేసేయమనరుగదా ?'' అన్నాడు భయ పడుతూ.

"ఓహో! బ్రహ్మచారులన్నమాట. ఒక్కసారే అంతమాట అనేయంగాని, పెళ్లి మాత్రం త్వరగా చేసేసుకోవాలి'' — అంది జెట్టు పోనివ్వకుండా.

"చూస్తా. మరి ఇంటివారు — మీారు చెప్తున్నారుగా. శిపసావహించాల్సిందే.

అయినా ఇల్లిచ్చేటప్పుడు ఆ షరతు పెట్టిన జ్ఞాపకం లేదే? —''

"మా డాడీ మర్చిపోయుంటారు. పోనీ ఇప్పుడైతేనేంలెండి. నేను చెప్తున్నాగా. మీరు ఎంత త్వరగా పెళ్లి చేసేసుకుని, ఫేమిలీని తీసు కొస్తే అంత మంచిది. నా చిరకాల వాంఛ నెరవేరుతుంది'' ఆఖరిమాటనేసి, చటుక్కున నాలిక్కరుచుకుంది. అది గమనించి "మీా చిరకాల వాంఛా ? అదేమిటో నేను తెలుసుకో వచ్చా ?'' అనడిగాడు. కొద్ది క్షణాలు తటపటాయించి.

"ఏముందీ ? ఇన్నాళ్లూ మద్రాసు హోటల్‌కెళ్లి దోసెలు తినిరావడం తెలుసుగాని, తయారుచేయడం రాదుగా మాకు. అదే మా యింట్లోకి మదరాశీయులొస్తే, నేర్చేసుకుని, అప్పుడు, దోసెలు చేయడంకూడ వచ్చున్న క్రెడిట్ కొట్టేయొచ్చన్న ఆశ.''

"అంతేకదా. బ్రతికించారైతే. దోసెల కోసమే అయితే పెళ్లి చేసుకు తీరాలన్నంత ఆవశ్యకత లేదులెండి. రేపట్నుంచి, వంటల పుస్తకం దగ్గర పెట్టుకుని, వంటింట్లో ప్రయోగాలు మొదలు పెడతా. ఆ తర్వాత మీకూ నేర్పిస్తా...కాని మీరు మాత్రం నన్ను చాలా హడలెత్తించేశారు. మావైపు ప్యాచ్



లర్స్‌కి ఇల్లు దొరకడం చాలా కష్టం. ఎవ్వరూ అద్దెకివ్వరు. కొంపదీసి, ఢిల్లీలోకూడ అలాగేనా?'' అని భయపడిపోయా ననుకోండి.

వెనకటికి మా ఫ్రెండొకడు, యిలాంటి చిక్కుల్లోనే పడ్డాడోసారి. ఎంతకీ యిల్లు దొరక్కపోవడంతో విసిగిపోయి, పెళ్లయిందని అబద్ధంచెప్పి ఒకింట్లో దిగిపోయాడు.

మర్నాటినుంచీ యింటావిడ తగులుకుంది. ''అమ్మాయినెప్పుడు తీసుకొస్తావు బాబూ!'' అంటూ.

''నాకు యీ మధ్యే పెళ్లయిందండీ. అయిదోనెలనే కాపరానికి పంపే అలవాటట మా అత్తారికి'' అంటూ రెడీగా పెట్టుకున్న అబద్ధాన్ని, అతికినట్టుగా చెప్పేసి, తప్పించుకున్నాడు కొన్నాళ్లు.

''ఏమిటో?—ఆ చాదస్తాలన్నీ. నువ్వయితే సత్యకాలం వాడివిగాని, యీ రోజుల్లో కుర్రాళ్లు రుకుంటున్నారేమిటి?— పుస్తె ముడేసిన మర్నాడే, పెళ్లాన్ని తీసుకు చక్కా వస్తున్నారు'' అనుకుంటూ వెళ్లిపోయిందావిడ.

నిశ్చింతగా రోజులు నెట్టుకొచ్చేస్తున్నాడు మా వాడు. అయిదు నెలల గడువు మాటా, మనవాడైతే మర్చిపోయాడు గాని, ఆవిడ మర్చిపోలేదు.

''అయిదోనెల వచ్చేసినట్టుంది. అమ్మాయి ఎప్పుడొచ్చేదీ ఏమైనా ఉత్తరం వచ్చిందా నాయనా?'' అంటూ నిలేసిందో రోజు.



మా వాడికి నిలువు గుడ్లు పడ్డాయి. ఉపాయం కోసం, బుర్ర అతివేగంగా ఆలోచిస్తోంది. ఎవరి నోటి నుంచో విన్న శూన్య మాసం అన్న ముక్క హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. దాన్ని మరోసారి నెమరేసుకుని. ఆపద్బాంధవిలా ఆదుకున్నందుకు, దానికి మనస్సులోనే కృతజ్ఞతలు తెలుపుకుని, ''ఏదీ ? మూఢమటగదాండీ యిప్పుడు. క్రొత్త పెళ్లి కూతుళ్లు యీ నెలలో కాపరానికి రాకూడదట. నిన్ననే మామగారు ఉత్తరం వ్రాశారు...వాళ్లకేం ? మధ్య హోటల్ తిండి తినలేక నేను చస్తున్నా. ఏంమనుష్యులో ? ఏంలోకమో ?'' అంటూ లేని అత్తారిమీద చిరాకు ప్రదర్శించాడు.

''ఏం చేస్తాంలే నాయనా! ఇంతకాలం ఓపిక పట్టినవాడివి, యింకో నాలుగు రోజులు ఓర్పు వహించు—'' ఓదార్చిందావిడ.

ఆ శూన్యమాసం నెళ్లాళ్లు కూడా పూర్తయి పోవచ్చింది. ఈసారి మనవాడు ముందు జాగ్రత్తే తీసుకున్నాడు. ఉన్నట్టుండి ఒకరోజు, యిన్ని లడ్డూలైతే తీసుకొని, యింటావిడ దర్శనానికి వెళ్లాడు. పుట్టెడు సిగ్గుపడిపోతూ, ''ఇంటిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందండీ...మరేమో... నేనూ... నేనూ...త్వరలోనే తండ్రిని కాబోతున్నానటండీ'' అన్నాడు మెలికలు తిరుగుతూ.

ఘుమ ఘుమలాడి పోతున్న నేతి మిఠాయిని చూసేసరికి, యింటావిడ పరమానంద భరితురాలై పోయింది. ''త్వరలోనే పండంటి కొడుకుని ఎత్తుకో'' అంటూ ఆశీర్వచనం కూడ యిచ్చింది.

తర్వాత, అడపా, తడపా, ''అమ్మాయెలాఉందీ ? కులాసాయేనా ? — ఉత్తరాలొస్తున్నాయా ?'' అంటూ క్షేమ సమాచారాలు కూడ కనుక్కోవడం మొదలు పెట్టింది.

''ఏం కులాసాయో గాని. ఏం చెప్పమంటారు? వేవిళ్లతో తిండి ఒంటబట్టటం లేదటండీ. మనిషి చిక్కి శల్యమైపోయిందట'' అనేవాడు విచారంగా ఫోజుపెట్టి.

ఆవిడెంత ముఖం చేసుకుని. ''అంతే నాయనా ! అయిదు నెలలొచ్చేదాకా ఏవీ యిమడవు. అదే నాకైతేనా ?—మా పెద్దాడు కడుపున పడ్డప్పుడు ... '' అంటూ ఆవిడ వేవిళ్ల ముచ్చట్లు చెప్పుకొచ్చేది.

మావాడి కథనం ప్రకారం, పెళ్లానికి అయిదోనెల వచ్చేసింది. ఆరోగ్యమూ కుదుటబడింది. వచ్చే తారీఖు కూడ నిర్ణయం అయిపోయింది. అలాంటి టైములో హఠాత్తుగా, ఆ యింటికి పెద్ద దిక్కయిన ముసలమ్మగారు పోయింది. అంతే. భార్యామణి ప్రయాణం ఆగిపోయింది.

మరో రెండు నెలలు గడిచాక వచ్చి ''ఏడో నెలలో ఏవో సూడిదలూ అవీ అటగదాండి? వేడుకలేవో చేయాలని మా అమ్మా వాళ్లూ తీసుకెళ్లారుట'' అని చెప్పాడు.

వాళ్లఊరివాళ్లెవరో, యిక్కడకొస్తూంటే





పంపారనిచెప్పి, సూడిదల తాలూకు మితాయిలు కూడ పట్టుకెళ్లి యిచ్చాడు.

దెబ్బతో, ఆవిడ, మనవాడి ట్రాప్‌లో పూర్తిగా పడిపోయింది.

''నాలుగు రోజుల దానికి, మళ్లీ ప్రయాస గాని, ఎందుకూ వెళ్లిరావడం. ఏకంగా పురుడొచ్చాకే కాపురం పెట్టుకుంటారులెమ్మని, మా అత్తగారు పంపనంటోందట. ఏం చేయాలో నాకూ పాలుబోవడం లేదు. మిమ్మల్ని అడుగుదామని యిలా వచ్చా—ఈ టైములో పనిపాటలు చేసుకోవడం కష్టమేనంటారా? లేకపోతే, ''వెంటనే పంపవలసిం'' దంటూ, కోపంగా ఒక ఉత్తరం వ్రాసి పడేయనా?''అంటూ సలహా కోసంవెళ్లాడోరోజు.

''పోనీలే, నాయనా! తొలిచూలు. ఇబ్బంది పెట్టకు. వాళ్లకూ, ఒక్కగాని ఒక్క కూతురంటున్నావాయె. ఏకంగా. ఆ పురుడొచ్చాకే, తల్లీ పిల్లల్ని, తీసుకు తెచ్చుకుందుగాని'' అందావిడ.

అలాగ, మా వాడిలా, నేనూ ఎలాంటి సాకు వెతుక్కోవాలా అని, ఆలోచనలో పడ్డా. మీరు కాదు; కూడదు'' అంటే తప్పదు మరి. ఇలాంటిదే ఏదో...''

ఇద్దరూ గట్టిగా నవ్వేశారు.

''మీరు చాలా సరదాగా మాట్లాడతారు'' అంటూ మనస్ఫూర్తిగా అభినందించింది సుషమ.

మధుకీ అదే ఆశ్చర్యంగా ఉంది. ''పరాయి అమ్మాయితో తనేనా అన్నిమాటలు మాట్లాడిందీ?''?అని. కాళిదాసు ముఖంచూసేసరికి, భోజరాజుకి కవిత్వం పుట్టుకొచ్చేదట. అలాగ, యీ అమ్మాయి ముఖం చూసేసరికి, తనకి మాటలు పుట్టుకొస్తున్నట్టున్నాయిగాబోలు'' అనుకున్నాడు.

# రెండు పువ్వులు

''థేంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్''అంటూ కృతజ్ఞతలుకూడ తెలిపాడు.

''మేమేమీ మీ వైపు వాళ్లలా అంత స్ట్రిక్ట్‌గా ఉండంలెండి. మరేం భయపడక్కర్లేదు''అంటూ అభయ హస్తం యిచ్చి, వెళ్లడాన్కి లేచినిలబడింది సుషమ.

''పెద్ద బెడదనుంచి తప్పించారు. అందుకుగాను, మరోసారి నా కృతజ్ఞతలు స్వీకరించాల్సింది'' అంటూ మధుకూడ లేచి నిలబడ్డాడు.

''ఏది బెడద అంటారూ? — మరో యిల్లు వెతుక్కోవడమా ? లేక పెళ్లి చేసుకోవడమా?'' అంటూ విస్మయంగా అడిగింది; సుషమ. అసలే విశాలంగా ఉన్న ఆ అమ్మాయి నేత్రాలు, మరింత విశాలంగా విచ్చుకున్నాయి.

''పెళ్లే'' అంటూ సమాధానం చెప్పాడు మధు.

''మీ దృష్టిలో వివాహం ఒక బెడదా?— ఎవరికైనా, జీవితంలో ముఖ్యమైన మలుపు అదే గదాండి?'' అంది ఆశ్చర్యంగా.

''బెడద కాదంటారా?'' అంటూ అమాయకంగా ముఖంపెట్టి ఎదురు ప్రశ్నించాడు.

''వైఫీజ్ నైఫ్ టు కట్ అవర్ లైఫ్'' అంటారు గదండీ. ఇంకేముందీ?—పెళ్లయితే మాకు సంకెళ్లే. అమ్మగారి మాటలకి, ''జీ హుజూర్ ! '' అంటూ కొంగుపట్టుకు తిరగాల్సిందే గదా? ఇంకా స్వేచ్ఛ ఎక్కడుంటుందీ?'' మధు మాటలకి, సుషమ గట్టిగా నవ్వేసింది. ఆ అమ్మాయి నవ్వుతో మధు కూడ శృతి కలిపాడు.

''ఇల్లు నచ్చినట్టేగదా మీకు. సామాన్లు సర్దుకోవడం యింకా అవలేదులా ఉంది'' అంది; గది నలుమూలలా పరీక్షగా చూస్తూ.

మధు నవ్వాడు.

''నచ్చింది గాబట్టే, చూడగానే ఒప్పుకున్నాను. ఇంట్లో దిగిపోయాను. ఇంక సామానుల మాటంటారా?— సర్దుకోడానికి ఉన్నవి ఎన్నని? ఇప్పుడే క్రొత్తగా సంసారం పెట్టడంగదూ? — బివిూన్. ఇల్లు తీసుకుని సెటిలవడం అన్నమాట. ఇంకా ఫర్నిచరూ, అదీ స్థిమితంగా కొనాలి''.

''ఫర్నిచర్‌కేముంది ? ఇక్కడ మంచి సెట్లు అద్దెకు దొరుకుతాయి. ప్రస్తుతానికి వీటితో అవసరం తీర్చుకోండి. ఆ తర్వాత సావకాశంగా చూసి కొనుక్కోవచ్చు''

''చూద్దాం. ఎలా వీలైతే అలా చేస్తాను. మీ సలహా మర్చిపోనులెండి.''

''సరే, అయితే. నేనువచ్చి చాలా సేపయిపోయింది. ఇంక వెళ్లాలి. మీకేమైనా అవసరమైతే,అడగటాన్కి మొహమాట పడకండి. డేడీ ఆ బాధ్యత నా కప్పగించారు.

మమ్మీ హెల్త్ కూడ అంతమంచిది కాదు. మేడమెట్లెక్కి దిగలేదావిడ.

మీరు మా యింట్లో ఉన్నందుకుగాను, మీ మంచి చెడ్డలు చూడాల్సిన బాధ్యత మాకుంది. ఏలోటుపాట్లయినా వచ్చాయంటే, పాపా నన్ను కోప్పడగలరు. వస్తామరి. నమస్తే'' అంటూ రెండు చేతులూ జోడించింది.

ప్రతినమస్కారం చేస్తూ,''తప్పకుండాను. మీరు చెప్పినా, చెప్పకపోయినా, నేనుమాత్రం అవసరమైనవి అడగక మాననులెండి. నాకు తెలిసినవారు యిక్కడ మీరొక్కరేగదా. ఇటువంటి సహృదయులైన యింటి ఓనర్సు దొరకడంకూడ, నా సుకృతమేను'' అన్నాడు మధు, ఆ అమ్మాయిని సాగనంపుతూ.

కొన్ని మెట్లు క్రిందకు దిగిపోయిన సుషమ, ''సారీ'' అంటూ మళ్లీ వెనక్కు వచ్చింది.

''చూశారా ? నేనొచ్చింది ఒకందుకైతే, మాట్లాడింది మరొకటి. అందుకే మమ్మీ చేత అక్షంతలు పడుతూంటాయి. అమ్మ మీకేంకావాలో కనుక్కురమ్మంది —

''మీరు కొంచెం'చాయ్' తీసుకుంటారా?'' అంది దగ్గరగా వస్తూ.

''నో. థేంక్యూ. వద్దండీ నేనిప్పుడే, యిక్కడ కొచ్చేముందే హోటల్‌కెళ్లి, కడుపు నిండా తినివచ్చా'' అన్నాడు నవ్వుతూ.

''ఓ. కె! మళ్లీ కలుద్దాం'' అంటూ వెళ్లిపోయింది.

ఆ అమ్మాయి వెళ్లిపోయినా,ఆమెతాలూకు మధురభావనలు, పూవుని వెన్నంటి వచ్చే తావిలా, మధు మనస్సంతా గుభాళిస్తూనే ఉన్నాయి.

''రంభ, ఊర్వశి అంటూ చదువుకున్నాం. ఆ అప్సరాంగనలు యిలాగే ఉండేవారేమో ?'' అనుకున్నాడు.

''మగాడిని చూస్తే చాలు. ముడుచుకుపోతూ మెలికలు తిరిగిపోయే మన ఆడపిల్ల

లకూ, — పిలిచి, చనువుగా పలకరించి, నిర్భయంగా మాట్లాడే యిక్కడి ఆడపిల్లలకూ ఎంత తేడా'' అనుకుని ఆశ్చర్యపోయాడు.

''అదే మనవైపైతేనా?—ఆ వయసమ్మాయిలు, పరాయి మగాడితో మాట్లాడితే చాలు; ఇరుగూ పొరుగూ అమ్మలక్కలు, వాళ్లనింక చెడిపోయిందాని క్రిందేకట్టేస్తారు'' అని జ్ఞాపకం వచ్చి నవ్వుకున్నాడు.

''థేంక్యూ'', ''సారీ'' లాంటి పదాలు, నాలిక చివరే ఎప్పుడూ ఉంటూంటాయి వీళ్లకు. ప్రతి మాటలోనూ సభ్యత, సంస్కారం ఉట్టి పడుతూంటాయి. చిన్నప్పట్నుంచీ కాన్వెంట్లో చదువుతారేమో, చక చకా ఇంగ్లీషు మాట్లాడేస్తూంటారు''అని ఎంతో ముచ్చటపడి పోయాడు వాళ్లని తలుచుకుని.

నెమ్మది నెమ్మదిగా, తనూ, ఆ వాతావరణానికి అలవాటు పడిపోసాగాడు మధు.

ఢిల్లీ జీవితం అప్పుడే పాతబడి పోయింది.

''ఇక్కడివాళ్లు ఎంతో సోషల్ గా ఉంటారు. వాళ్ల అలంకరణా అదీ ఎంతో నవీనంగా ఉంటుంది. ఎలాగా ఉత్తర భారతీయులకి విదేశీ సంస్కృతి, వేషం అబ్బాయి! అందులోనూ ఢిల్లీ లాంటి కాస్మో పోలిటన్ సిటీలో ఉండేవాళ్లు మరీ సివిలైజ్డ్గా ఉంటారు'' అనుకుని మరింత యిష్టత పెంచుకున్నాడు.

''ఇంకా నయం. ఇంట్లో వాళ్ల మాట విని, యింత దూరం రాకుండా, ఆ చుట్టు ప్రక్కలే ఉద్యోగం వెలగబెట్టుంటే—నా దృక్పథం కూడ అలాగే ఉండిపోను. తెగించి వచ్చానేమో—కొంచెం విశాల దృక్పథం ఏర్పడుతోంది''—అని కూడ అనుకున్నాడు.

ఇంటి వారమ్మాయి సుషమతో ఆనేళ అయిన పరిచయం చనువుగా పిలిచి పలకరించేంత వరకూ వచ్చింది; మధుకి.

సుషమ తరచు పైకి వస్తూనే ఉంటుంది. ఒకోసారి తండ్రితో కలిసి, అప్పుడప్పుడు ఒంటరిగా కూడ వస్తూంటుంది.

ఆ పరిచయం అయిన క్రొత్త రోజుల్లోనే, ఒకసారి, మధు, చెప్పేశాడు.

''చూడండీ! చిన్న మాట. మీరేమో ''అంకుల్! అంకుల్'' అంటూ, ఎక్కడలేని మర్యాదా చూపిస్తూ, నాకేదో పెద్ద గౌరవం ఆపాదిస్తూంటే — నాకెందుకో భయంగా ఉంది. మీరు ''అంకుల్!'' అని పిలిచే ఆ పిలుపుతో, మా ప్రక్కింటి పిన్నిగారి మొగుడూ; మొన్ననే అరవై ఏళ్లూ నిండి షష్టిపూర్తి చేసుకున్న మా సుబ్రావ్ మామయ్యా జ్ఞాపకం వస్తున్నారు.

కనుక ... ప్లీజ్ ... నన్ను మరీ అంత పెద్దాళ్లలో జమ చేసేయకండి. ఏదో, కుర్రాడిని— బ్రహ్మచారిగాడిని. కొంచెం దయతలచి పేరుతో పిలిస్తే సంతోషిస్తా.

''ఇరవై ఒకటో రోజు, నామకరణం నాడు ముచ్చటపడి మా తల్లిదండ్రులు పెట్టిన పేరుంది. ''వీర వెంకట వరప్రసాద మధుసూధనావూ!'' అంటూ దాంతో పిలిచినా నాకేం అభ్యంతరంలేదు; పలుకుతాను. ఒకవేళ ''అంత పేరు పెట్టి పిలవడమే! — నా తరంకాదు'' అంటారూ సింపుల్గా ''మధూ'' అనండి చాలు. ఏమంటారు???''

సుషమ నవ్వేసింది. ''మీ పేర్లు భలే గమ్మత్తుగా ఉంటాయే. — ఎందుకొచ్చింది బాబూ! అంత పెద్ద పేరుతో నేను పిలవలేను. ''రావూ సాబ్!'' అని పిలుస్తా. ... కానీ ఒక షరతు. మీరూ, నన్ను మన్నించడం మానేసి, ''సుషమా!'' అని పిలిస్తేనే. మీ మర్యాదలతో నాకూ అంతకంటే ఉక్కిరిబిక్కిరిగానే ఉంది. అందులోనూ, — మీరు హిందీ నేర్చుకోడంకాదుకాని, ''సుషమాజీ!'' అంటూ నా పేరుని ఖూనీచేసి పిలుస్తూంటే, మాకో వంటాడు ఉండేవాడు — ''శర్మాజీ'' అని— అతను జ్ఞాపకం వస్తున్నాడు. మీరు సరేనంటే నాకూ ఏం అభ్యంతరంలేదు''—

ఇద్దరూ గట్టిగా నవ్వేశారు.

''అయితే యిద్దరం ఎక్కింది ఒక బోటే నన్నమాట. సరే; ఒప్పుకున్నానైతే'' అన్నాడు మధు.

ఆ అమ్మాయికి ఒకన్నయ్యా, ఒక చెల్లెలు ఉన్నారట. అన్నగారు ఆర్మీలో ఉన్నాడట. చెల్లెలు పుట్టాక తల్లికి చాలా జబ్బు చేసిందట. అందుకని చూసేవాళ్లు లేక, ఆ పిల్లను సిమ్లాలో ఉంచి చదివిస్తున్నారట.

అటు కాలేజీ, ఇటు యింటి పనులు, మరోవైపు రోగిష్టితల్లి సేవా శుశ్రూషలుతో, వయస్సుకి మించిన భారం మోస్తున్నప్పటికీ, మనిషిమాత్రం, ఎప్పుడూ చూడ్డానికి హుషారుగా, చలాకీతనంతో కనిపిస్తూంటుంది. అందుకే ఆపిల్లంటే తండ్రికి మహా ఆపేక్ష.

ఆంధ్రులన్నా, వారి ఆచారవ్యవహారాలన్నా, ముఖ్యంగా ఇడ్లీ, సాంబారు విషయాల్లోనూ సుషమకు కుతూహలం ఎక్కువ. అన్నీ వివరంగా అడిగి తెలుసుకుంటూంటుంది అస్తమానూ. ఆ అమ్మాయి వచ్చినప్పుడల్లా, కబుర్లతో గంటలు క్షణాల్లా గడిచి పోతూంటాయి.

ఏ మాత్రం టైము దొరికినా, పైకొచ్చి మధుదగ్గరున్న మేగ్జయిన్సు నవల్సు అడిగి పట్టుకెళ్లతూంటుంది, ఆ అమ్మాయి ఇంట రెన్ను చూసి ప్రత్యేకం ఆ అమ్మాయి కోసరమని ఫెమీనా, ఫిల్ముఫేర్ లాంటి పత్రికలు కూడ తీసుకోవడం మొదలుపెట్టాడు మధు.

సుషమ కూడ, ఏమైనా ప్రత్యేకంగా పిండి వంటలూ వగైరా చేసినప్పుడు, మధు కోసం పైకి తీసుకొస్తూంటుంది. ఒకోసారి పండుగ లప్పుడూ, శెలవు దినాల్లోనూ కూడాబలవతం చేసి, మరీ భోజనానికి లాక్కెళ్తూంటారు తండ్రీ కూతుళ్లు.

[ఇంకా వుంది]



కంపెనీ ఆవరణలో హెచ్. ఎమ్. టి. బస్సులు వరుసగా నిలిచి వున్నాయి. ఛాదర్‌ఘాట్ వేపు వెళ్ళే బస్సులో ఎక్కి కూర్చున్నాను.

మరో ఐదు నిముషాలలో బస్సు వర్కర్లతో నిండిపోయింది. బస్సులో కూర్చున్న వారంతా నావేపు 'ఎవరీ క్రొత్త మనిషి' అనే భావంతో కాబోలు వింతగా చూస్తున్నారు.

మా బస్సు సనత్ నగర్ రోడ్డు మీదుగా దూసుకు పోతోంది. ఫ్యాక్టరీ గొట్టాల్లో నుంచి వస్తున్న పొగ, సంధ్య కాంతులు కలసి ఆ ప్రాంత మంతా నీరు కావి గమ్మినట్లుంది. నాచూపు హఠాత్తుగా నా ముందు సీటులో కూర్చుని వున్న అమ్మాయిపై పడింది. ఆమె యేడుస్తోంది! ఎవరికీ కనిపించకుండా ముఖానికి పమిట కొంగు చాటుచేసుకొని గుంభనంగా యేడుస్తోంది. ఆటవిడుపు వేళ కలిగే ఆనందంలో బస్సులోని జనమీమె ఉనికిని గమనించినట్లు లేదు. దీక్షగా ఆమెవేపు చూశాను. చాలా చిన్న వయసు. హాయిగా చదువుకోవలసిన వయసులో పొట్ట చేతబట్టుకొని వుద్యోగంలో చేరినట్టుంది! పాపం ఆఫీసులో చీవాట్లు తిన్నదేమో, అభిమానంతో యేడుస్తోంది. అంతకంటే యింకేం చేయగలదు?

రెసిడెన్సీ సర్కిల్లో ఆమె దిగిపోతున్నప్పుడు ఆమెను పరీక్షించి చూశాను. ఆకర్షణీయమైన ముఖం. నేనుండటం ఆమెకు కూడా క్రొత్తగా తోచిందేమో, రెండు మూడుసార్లు వెనుదిరిగిచూచి దిగిపోయింది.

ఛాదర్‌ఘాట్ వద్ద బస్సు దిగాను 'రోజ్' ఫ్యాన్సీ స్టోరులో నానిగాడికి బిస్కెట్ పాకెట్ కొని యింటికి బయలుదేరాను. వీధి మలుపు తిరగగానే వాకిట్లో నిలబడివున్న వదిన, నానిగాడు కనిపించారు. హుషారుగా అడుగులువేస్తూ యింటిని సమీపించాను.

"మీ బాబాయి వాలకం చూస్తుంటే వుద్యోగాన్ని భుజాన వేసుకొస్తున్నట్టుందిరా నానీ" అంది వదిన నన్నుచూచి నవ్వుతూ. నిజంగా నా భుజంమీద యేదో వుందని వెదకటం ప్రారంభించాడు వాడు. నేను ఫక్కున నవ్వి వాడికి బిస్కెట్ పాకెట్ అందించాను.

"ఏమయిందిరా?" అంటూ ప్రశ్నించాడు అన్నయ్య, నేను యింట్లోకి వెళ్ళగా నే. అపాయింట్‌మెంట్ ఆర్డరు చూపించి జరిగినదంతా వివరించాను.

"గుడ్" అన్నాడు అన్నయ్య.

"ఎలాగైతేనేం, వుద్యోగస్తుడి వయ్యావోయ్!" అన్నది వదిన మా సంభాషణ అంతా శ్రద్ధగా విన్నమీదట. నేను సిగ్గుతో తల దించుకున్నాను.

"ఐదింటికే నిన్ను లేపడమెందుకనీ..." అంటూ నసిగాను.

"అబ్బే... నీలో వుద్యోగస్తుడి లక్షణాలు బొత్తిగా లేవోయ్! మీ అన్నయ్యచూడూ — దర్జాగా ఎనిమిదింటికి లేస్తాడు."

"రేపటినుండి నేనుకూడా అలాగే లేస్తాలే!" అన్నాను నవ్వుతూ.

# మరో ప్రేమకథ



భూపతి జ్ఞానసుందర్

"ఐదింటికే లేచావేం?" వంటింట్లోకి వస్తూనే అడిగింది వదిన.

"మొదటిరోజు గదూ! ఆలస్యం కాకూడదు." అన్నాను కాఫీ కలుపుకుంటూ.

"మొదటిరోజయితే మాత్రం — క్రొత్త బిచ్చగాడిలాగా మరీ ఆయిదింటికే తయారవ్వాలా యేమిటి? కాఫీ నేను పెట్టివ్వనా!"

"అలాగేం! బిందెడు చన్నీళ్ళు కుమ్మరిస్తాను ముఖంమీద."

ఇద్దరం పెద్దగా నవ్వుకున్నాము. ఈ హడావిడికి అన్నయ్య కళ్ళుతెరిచి చూచి మళ్ళీ ముసుగు తన్నిపడుకున్నాడు. వదిన టిఫిన్ తయారుచేసి చిన్నకారియర్లో పెట్టియిచ్చింది.

"ఇదెందుకూ!" అన్నాను ఆశ్చర్యంగా.

"షోకులు చెయ్యకు, నువ్వు వెళ్ళేది ఆఫీసుకు. కాలేజీకికాదు."

మాట్లాడకుండా టిఫిన్ కారియర్ చేత బట్టుకొని బయులుదేరాను. ఎవరైనా చూస్తా రేమోనని చచ్చేంత సిగ్గుగావుంది. సరిగ్గా తొమ్మిదింటికి కంపెనీ బస్సు శాంతిభవన్ సర్కిల్లో ఆగింది. అందులో ఎక్కి కూర్చున్నాను. రెసిడెన్సీ వచ్చేసరికి నా కళ్ళు ఆత్రంగా వెదకసాగాయి ఆ అమ్మాయికోసం. నా ఆశ ఫలించింది. ఆమె బస్సులోనికి ఎక్కి అలవాటు ప్రకారం నన్నోమారు వింతగా చూచి తన సీట్లో కూర్చుంది. అబ్బా! ఎంత విశాల మైన కళ్ళు! కనురెప్పలను కాటుకతో గీచి నయనాలను మరీ విశాలం చేసింది. ఆమె రాగానే నాకు బస్సు నిండిపోయినట్లనిపించింది.

"మధుసూదనరావు మీరేనా సార్!" వాకిట్లోనే నిలేసి అడిగాడు ప్యూన్.

"అవును."

"అయ్యగారు పిలుస్తున్నారు."

టిఫిన్ కారియర్ ఎక్కడదాచాలో తెలియక కాసేపు తచ్చాట్లాడి చివరకు ప్యూన్ చేతిలోనే దానిని కుక్కి లోపలికెళ్ళాను.

"గుడ్ మార్నింగ్ సార్!"

"గుడ్‌మార్నింగ్, మధూ! లెటర్ డిక్టేట్ చేస్తాను వ్రాసుకో." అన్నారు ఆఫీసరుగారు యేదో పుత్తరం చదువుతూ. నేను 'పరికరాల' కోసం తడుముకోసాగాను. ఆయన నా అవస్థ కనిపెట్టి, "ప్రక్కగదిలో షార్టుహాండ్ పుస్తకమూ, పెన్సిలూ వుంటాయి తెచ్చుకో" అన్నారు.

స్టెనో అనే సైన్‌బోర్డున్న టేబిలు మీద నుండి షార్ట్‌హాండ్ బుక్కూ, పెన్సిలూ తీసుకొని తిరిగి వచ్చాను. ఆయన డిక్టేట్ చేస్తున్నారు. నా చేతులు వొణకుతున్నాయి. ఎలాగో అయిందనిపించాను.

"టైప్‌చేసి తీసుకురా." అన్నారాయన.

స్టెనో గదిలోకి వెళ్ళాను. డ్రాయరుతీసి తెల్లకాగితాలూ, కార్బన్ పేపర్లూ టైప్ రైటర్‌కి బిగించి షార్ట్‌హాండ్‌లో వ్రాసిన మాటల్ని టైపుచేశాను. తప్పులు కాస్త అధికంగానే వున్నట్లున్నాయి. భయపడుతూ ఆ కాగితాల్ని ఆఫీసరుగారికి అందించాను. ఆయన దానిని చదివి "గుడ్! అలవాటయితే తప్పులు దొర్లవు" అని పెన్సిలుతో తప్పుల్ని దిద్దారు. తర్వాత టేబిల్‌మీదున్న బెల్ నొక్కి ప్యూన్‌చేత హెడ్‌క్లర్క్‌ని పిలిపించారు.

"చూడండి శేషాద్రిగారూ! ఇతడే మధుసూదనరావు. క్రొత్తవాడు గనుక యీ ఆఫీసు అనుపానులేవీ తెలియవు. దగ్గరుండి అన్నీ నేర్పండి." అని చెప్పారాయన హెడ్‌క్లర్క్‌తో.

"అలాగేసార్!" అని నన్ను తన గదిలోనికి తీసుకువెళ్ళారు శేషాద్రిగారు. కూర్చోమని చెప్పి నేను చెయ్యవలసిన పనులను వివరించసాగారు నేను శ్రద్ధగా ఆలకిస్తున్నాను. ఇంతలో నేను టైపుచేసిన కాగితాలను తెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళిపోయాడు ప్యూను. శేషాద్రిగారు ఆ వుత్తరాన్ని చదివి 'డిస్పాచింగ్' సెక్షన్లో యిచ్చిరమ్మని నాతో చెప్పారు. ఆ కాగితాల్ని చేతబట్టుకొని మెయిన్ ఆఫీసులోకి వచ్చాను. 'డిస్పాచ్' అని వ్రాసివున్న టేబిల్ వద్దకు వెళ్ళాను. ఆశ్చర్యం! 'ఆమె' ఆ టేబిల్ వెనుకనున్న కుర్చీలో కూర్చునివుంది. నన్ను చూడగానే గాభరాగా లేచి నిలుచుని తర్వాత అలా చెయ్యగూడదనే విషయం జ్ఞప్తికి వచ్చిందేమో, మళ్ళీ కూర్చుంది.

"ఇవి డిస్పాచ్ కివ్వమన్నారు."

"మీరు ..."

"స్టెనో. క్రొత్తగా చేరాను."

"అలాగే!" అని తన పనిలో నిమగ్నమైపోయింది. కాసేపు నిలబడి తర్వాత మిగిలిన జనమంతా నన్ను వింత మృగంలా చూస్తుండటంచేత వెనుదిరిగి వచ్చేశాను.

"ఆఫీసరు పిలుస్తున్నారు వెళ్ళండి." అని చెప్పాడు హెడ్‌క్లర్క్.

ఆఫీసరుగారి గదిలో ఒక పొడవుపాటి వ్యక్తి నిలబడి వున్నాడు. ఎర్రగా బడితెలావున్నాడతడు. కాని పాపం ముఖంలో ప్రేతకళ నాట్యం చేస్తోంది. ముక్కు పొడవుగా వుండి కొన క్రిందకి వంగి గ్రద్ద ముక్కులా వుంది.

"మిస్టర్ పాండే! మీట్ మిస్టర్‌మధు." అంటూ నన్నతడికి పరిచయం చేశారాయన. నే నతడితో కరచాలనం చేశాను.

"మధూ! ఇతడిక్కడ స్టెనోగావుండేవాడు. ప్రమోషన్ మీద బెంగుళూరు వెళ్తున్నాడు. ఇప్పుడు నువ్వతడి స్థానంలో పని చెయ్యాలన్న మాట. వెళ్ళి బ్రీఫింగ్ తీసుకో"మని చెప్పారు ఆఫీసరుగారు.

పాండేకి ఎదురుగా కూర్చున్నాను. అతగాడు హిందీలో, మధ్యమధ్య గోరాజీ యింగ్లీషులోనూ వసపిట్టలాగా వాగేస్తున్నాడు. నేనాతడి గ్రద్దముక్కుకేసి చూస్తూ కూర్చున్నాను.

ఆఫీసులో నా స్థానమేమిటో తెలుసుకునేందుకు దాదాపు వారంరోజులు పట్టింది. మా ఆఫీసరు నన్ను చాలా వాత్సల్యంగా చూసేవారు. శేషాద్రిగారు సరేసరి. వారిదికూడా మా గుంటూరు ప్రాంతం కావడంచేత ఆయన్ని నేను పితృసమానుడిగా గౌరవించడం వలన ఆయన నన్నెంతో అభిమానించేవాడు. మొత్తం మీద చాలా తక్కువ వ్యవధిలోనే నాకు ఒక ప్రత్యేకస్థానం లభించింది.

"మధూ! రేపు ఆదివారం నువ్వు ఆఫీసుకు రావాల్సి వుంటుంది. నేనూ వస్తున్నాననుకో! ఈ నెలాఖరులో యిన్‌స్పెక్షనుంది. పనేమో చాలా పెండింగులో వుంది." అన్నారు శేషాద్రిగారు నా టేబిలువద్దకు వచ్చి.

"అలాగే సార్!" అన్నాను వినయంగా.

"మా యిల్లు దగ్గరేగనుక నాకేమీ యిబ్బందిలేదు. ఎటొచ్చీ నీకే యిబ్బంది. మన కంపెనీ వాన్ వస్తుంది. అందులో వచ్చెయ్. అన్నట్లు డిస్పాచ్ క్లర్క్ మాలతి కూడా వస్తుంది. నీతోపాటు తీసుకురా."

"తప్పకుండా సార్!" అన్నాను సంతోషంగా. ఆమె యింటి అడ్రసు కాగితంమీద వ్రాసి యిచ్చారాయన.

మరునాడు వుదయం ఏడింటికే ట్రిమ్‌గా తయారై శాంతిభవన్ కెళ్ళాను. మా వాన్ కనిపించలేదు. పేపరుకొని తిరగేస్తూ, హోటల్లో కూర్చున్నాను. మరో అరగంట తర్వాత వాన్ వచ్చింది. డ్రైవరుతో మాలతి యింటి అడ్రసు చెప్పి అక్కడికి వెళ్ళమన్నాను. రెసిడెన్సీ సర్కిల్లోనే మాలతి కనిపించింది. ఆమె ఎక్కగానే వాన్ బయులుదేరింది. ఇన్ని రోజుల తర్వాత ఆమెతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం చిక్కినందుకు సంతోషంగా వుంది.

"మీరు రావడం ఆలస్యమౌతుందేమో ననుకున్నాను." అన్నాను నేను సంభాషణకు ఉపక్రమిస్తూ.

"నేనూ అలాగే అనుకున్నాను."

"నేనైతే ఏడింటికే బయులుదేరాను. వాన్

# మహామునులకోపం



— ధర్మపథం —
బులుసు వెంకటరమణయ్య

మహామునులు అనుగ్రహిస్తే ఆకాశానికి ఎక్కిస్తారు. కోపం వస్తే పాతాళానికి అణచి వేస్తారు. అణచి వెయ్యడమే కాదు. సర్వనాశం చేస్తారు. వారు శపించడంలోనూ, అనుగ్రహించడంలోనూ సమర్థులు. వారి తపశ్శక్తి అమోఘమైనది.

అట్టి మహామునుల్లో విశ్వామిత్రుడు ప్రసిద్ధుడు. తొలుత క్షత్రియుడైనా క్షాత్ర బలంకంటె తపోబలమే గొప్పదని గ్రహించి, పట్టుదలతో తపస్సు చేసి, మహామునిత్వాన్ని సాధించిన ఘనుడు.

సృష్టికి ప్రతిసృష్టి చేసిన అసాధ్యుడు.

అతనిపేరు చాలా విచిత్రంగా కనబడుతుంది. కాస్త చదువుకున్న వాళ్లంతా 'విశ్వ + అమిత్ర' అని విడదీసి, లోకానికి శత్రువు అని అనుకోసాగారు.

వ్యాకరణం వ్రాసిన చాలామంది అలాగే అర్థం చేసుకుని--సవర్ణదీర్ఘసంధినే విధించినారు.

ఇది మహామునిని అవమానించడంకాదూ? మహాముని లోకానికి శత్రువు అని అనుకోవడం అన్యాయం.

ఈ సంగతి తెలిసి విశ్వామిత్రుడు చాలా కోపించి వ్యాకర్తల దగ్గరికి వెళ్లి తన పేరు ఎలా సాధించారో అడిగారు. వారు సవర్ణదీర్ఘసంధినే తెలిపారు.

ఆ మహాముని మండిపడి 'నేను లోకానికి శత్రువునా? ఇలా అనుకునే మీ వ్యాకరణాలు నశించుగాక!' అని శపించాడు.

ఆ వ్యాకర్తలలో పాణిని లేడు. మహాముని అతనిదగ్గరకు వెళ్లి 'నా రూపం ఎలా సాధించావు?' అని అడిగాడు.

'విశ్వ+మిత్ర'అనే పదాలనీ, మిత్ర శబ్దం ప్రక్క ఉన్నపుడు 'విశ్వ' విశ్వాగా మారుతుందనీ పాణిని అన్నాడు. అందుకని ఆయన ప్రత్యేకంగా 'మిత్రే చర్షౌ' అని సూత్రాన్నే చెప్పాడు.

విశ్వామిత్రుడు చాలా సంతోషించాడు. "సరే! నీ వ్యాకరణమే స్థిరంగా ఉంటుంది" అని ఆయన అనుగ్రహించాడు.

ఇప్పుడు సంస్కృతంలో పాణినీయ వ్యాకరణమే నిలిచింది. దాన్నే అందరూ చదువుతారు.

# మరో ప్రేమకథ

రావడమే ఆలస్యమయింది." ఆమె మాట్లాడలేదు.

"పాపం ఒక హాలిడే పాడయింది మీకు."

"మీకు మాత్రం?"

"నాకు అన్నిరోజులూ ఒకటేలెండి."

"నాకూ అంతే."

"అయితే యిద్దరం ఒకటేనన్నమాట !" అన్నాను పెద్దగా నవ్వుతూ. ఆమె చురుగ్గా నావేపు చూసింది.

"నా వుద్దేశ్యం ... "

"సాయంకాలం వరకూపని వుంటుందా?" నా మాటల్ని మధ్యలోనే ఖండిస్తూ అడిగింది.

"ఏమో తెలియదు. మీకు అర్జంటు పనులేమైనా వున్నాయా?"

"లేవు." క్లుప్తంగా జవాబు చెప్పి వెంట తెచ్చుకున్న ఆ పత్రికలోకి ముఖం దూర్చేసింది. నాకు అభిమానంతో ముఖం ఎర్రనయింది. ఏమిటీ యీావిడ వుద్దేశ్యం? ఎదురుగా మనిషి కూర్చుని వాగుతుంటే లక్ష్యపెట్టకుండా అలా పుస్తకం చదువుతూ కూర్చుంటుందేం? పొగరుమోతులాగే వుంది. ఆఫీసు వచ్చేవరకూ మాట్లాడించలేదు. మేము వెళ్లేసరికి శేషాద్రిగారు ఆఫీసు తెరిచి వున్నారు. వెంటనే పని ప్రారంభించాము.

"ఏరోజు పని ఆ రోజే చేసుకుపోతుంటే యీ అగచాట్లెందుకు పడతాం? నెలంతా నిద్రపోతూ గడపడం, నెలాఖరున పెండింగు పడిపోయిన పనిని చూచి గుండెలు బాదుకోవడం. ఇలాగయితే యెలా కుదురుతుంది ?" అంటూ శేషాద్రిగారు మెత్తగా చీవాట్లు పెడుతున్నారు మాలతికి. ఆమె ముఖం ముడుచుకుంది. నాకు మహాసంబరంగా వుంది. ఆమెనింకా వుడికించాలనిపించింది గాని నాకై నేనేమైనా అంటే శేషాద్రిగారు తప్పుగా భావిస్తారన్న భయంచేత మాట్లాడకుండా వూరుకున్నాను. మధ్యాహ్నానికి నా పని పూర్తయింది.

"బాబూ, నేను యింటికి వెళ్లి వస్తాను. మీరు భోంచెయ్యండి. నీ పెండింగ్ జాబ్ పూర్తయింది గనుక మాలతికి కాస్త సాయం చెయ్యి. ఈరోజు పూర్తిచెయ్యకుంటే రేపామె చేతికి మెమో రావడం ఖాయం" అన్నారు, శేషాద్రిగారు.

"అలాగేనండీ! మీరు నెమ్మదిగా నే రావచ్చు తొందరేమీలేదు." అన్నాను లోలోన సంతోషిస్తూ. ఆయన వెళ్లిపోయారు.

"భోంచేద్దాం పదండి."

"నేను రాను, మీరు వెళ్లండి."

"భోంచెయ్యకపోతే నీరసం వస్తుంది — రండి"

ఆమె చివాలున తలెత్తింది. కళ్లు అశ్రుపూరితాలై వున్నాయి. నేను కరిగిపోయాను.

"ఆయన మాటలు పట్టించుకోకండి. పెద్దవాడుగదూ !"

"రండి ... ... "

"రండి భోంచేసివద్దాం."

"దయచేసి మీరు వెళ్లండి."

"మీరు వస్తుంటారా ?"

"ఫర్వాలేదు నా కలవాటే."

ఇక లాభం లేదనుకొని ప్యూన్ని పిలిచి కారియర్ ఆఫీసులోకే తెప్పించాను. మంచి నీళ్ల కూజా, రెండు గ్లాసులు అక్కడ పెట్టి వెళ్లిపోయాడు.

"భోంచేద్దాం రండి."

"నాకక్కర్లేదని చెప్పాను గదండీ !"

"నాకాకలి వేస్తోంది."

"మీరు భోంచెయ్యండి."

"మీరు తినకపోతే నేనూ తినను." భీష్మించుకు కూర్చున్నాను.

"బాగుంది, నేను తినకపోతే మీకేం ?".

"జాలి"

"నామీద జాలి ప్రదర్శించే వాళ్లంటే నాకసహ్యం."

"నేనంటే మీ కసహ్యమా !"

"... ..."

"ఏంచేశానని ?"

"మీరంటే అసహ్యమని కాదు ... మీరు నా మీద జాలిపడటం నాకిష్టంలేదు."

"సరే–లెంపలు వాయించు కుంటున్నాను. ఈ అన్నం కుక్కకు పారేసివస్తాను." అని విసురుగా వెళ్లబోయాను.

"ఆగండి–రండి భోంచేద్దాం."

ఆగిపోయి ఆమె కళ్లల్లోనికి అనుమానంగా చూశాను.

"అక్కర్లేదన్నారుగా !"

"అంటే మీరూరుకొనడంలేదుగా !"

"అయితే నా మీద జాలివేసి భోంచేస్తా రన్నమాట !"

ఆమె నావైపు చూచి చిన్నగా నవ్వింది.

"క్షమించండి. చిరాకుగా వుంది మనస్సు" అంటూ క్షమాపణ కోరింది.

"ఆ విషయం నాకూ తెలుసు ననుకోండి..." అంటూ కారియర్ విప్పాను. ఆమె మా యిద్దరికీ వడ్డించింది. హుషారుగా భోంచేయసాగాను.

"ఇదొక అపూర్వమైన అనుభూతి కదూ!" అన్నాను నేను.

"ఏదీ!" ఆశ్చర్యంగా అడిగిందామె.

"మనిద్దరం ... యిలా కలిసి భోంచెయ్యడం."

"అలాగా!" కళ్లు గుండ్రంగా త్రిప్పుతూ అంది మాలతి.

"కాదా?"

"ఏమోమరి."

"నిజంగా అపూర్వమే. లేకుంటే మనిద్దరం..."

"అప్పడం వేసుకుంటారా ?"

"మధ్యలో అప్పడాల గొడవెందుకులెండి." విసుక్కున్నాను నా మాటకు అడ్డు చెప్పినందుకు.

"ఏమండీ !"

"ఆఁ!"

"నేనంటే మీకు జాలెందుకు ?"

"జాలికాదు...నిజం చెప్పమంటారా?"

"చెప్పండీ" అంది నవ్వుతూ.

"మీరు గమనించారో లేదో, మిమ్మల్ని మొదటిసారి బస్సులో యేడుస్తుండగా చూశాను."

ఆమె ఫక్కున నవ్వింది.

"బాగుంది అప్పుడే తెలిసిందా మీకు?"

"పరిహాసం కాదు. నిజంగా నేనప్పుడే మిమ్మల్ని చూశాను. మీకు గుర్తుందో లేదో..."

ఆమె బరువుగా ముఖం దించుకుంది.

"తప్పుగా మాట్లాడానా?"

"లేదు."

"మాలతీ! ఒక్కొక్కర్ని కలుసుకున్న ఘడియ అటువంటిదేమో, మిమ్మల్ని అలా చూచిన క్షణంనుండీ మీరంటే నాకు జాలి... కాదు, అంతకంటే లోతైన అనుబంధం యేర్పడింది. మీ కభ్యంతరం లేకుంటే మీ గుండెల్లో దాగిన బాధను నాతో చెప్పండి. నేనూ భాగం పంచుకుంటాను."

"మీరా భారాన్ని మోయలేరు."

"ప్రమాణం చేస్తున్నాను. నేను మోయగలను."

ఆమె కన్నీళ్లు తుడుచుకుంది.

"నా కష్టసుఖాలు విచారించేవారితో నా మనోవ్యథను వెళ్లబోసుకునేందుకు నాకేం అభ్యంతరం లేదు. కాని అందువలన ప్రయోజనం శూన్యం. అంతా విని జాలి పడడం తప్ప అంతకు మించి మీరు చెయ్యగలిగినదేమీ వుండదు. అనూతానికి గతాన్ని తవ్వుకొని బాధపడడమెందుకు? ఆ విషయాన్ని వదిలెయ్యండి." అంది విషాదంగా నవ్వుతూ.

"మీ కభ్యంతరమైతే చెప్పొద్దులెండి." అన్నాను నిష్ఠూరంగా.

"అభ్యంతరంగాదు, అనవసరమని నా వుద్దేశ్యం. సరే — మీకంత కుతూహలంగా వుంటే చెబుతా వినండి. మా అమ్మ బ్రతికి వుండగా గారాబంగా పెరిగాను. అమ్మ చని పోవడంతో నాకు దుర్దినాలు మొదలయ్యాయి. నాన్న రెండో పెళ్లి చేసుకున్నాడు. సవతి తల్లి అజమాయిషీలో అన్ని కోరికలూ చంపుకొని నిరాశా జీవనానికలవడ్డాను. నా తోడి వారంతా హాయిగా కాలేజీలలో చదువు కుంటున్నారు. నాకా అదృష్టంలేదు. స్కూల్ ఫైనల్‌తో చదువుకు స్వస్తి చెప్పి పొట్ట గడుపుకొనేందుకు ఉద్యోగంలో చేరాను. వ్యక్తిత్వంతో సంపాదించుకుంటున్న స్వప్రయోజనానికి పైసా ఖర్చు పెట్టకోగలిగే స్వాతంత్ర్యం నాకు లేదు. పైగా నామీద ఘోరమైన సిలాప నిందలు మోపడం, నాన్నచేత ఎముకలు విరగకొట్టించడం పిన్నికి సరదా. అమ్మ వొడిలో తల పెట్టుకొని ఏడ్చేందుకు అమ్మ లేదు. నాన్న నాకా చనువివ్వడు. పాపం నా దీనావస్థకు మా యిరుగు పొరుగు వారంతా జాలి ప్రదర్శిస్తారు. కాని విచిత్రమేమిటంటే — సిలాప నిందలు మోపి వాటికి అధిక ప్రచారాన్నివ్వడానికి యీ అమ్మలక్కలు మా పిన్ని కెంతో సాయం చేస్తారు. అందుకే నా మీద జాలి ప్రదర్శించే వాళ్లంటే నా కసహ్యం. ఎవర్నీ నమ్మకూడదనే నమ్మకం పెంచుకున్నాను. నాకు తారసపడిన ప్రతివ్యక్తీ నా నమ్మకానికి పటుత్వం చేకూరుస్తూనే వచ్చారు. ఇదీ నా కథ. ఇదీ నా నిస్సార జీవిత సారం." అంటూ కన్నీళ్లు తుడుచుకుంది.

"మీకు తారసపడిన ప్రతివ్యక్తీ అంటే?"

"భయపడకండి. నే నెవరితోనూ ప్రేమ కలాపాలు సాగించలేదు. బహుశా అది నా తత్వానికే విరుద్ధమేమో! ప్రతివ్యక్తీ అంటే–నిత్య జీవితంలో తారసిల్లిన ప్రతి వొక్కరూ అని నా తాత్పర్యం."

"మన్నించండి. నేను అపోహవడిన మాట నిజం. నా సంశయ నివృత్తి కోసం అడిగాను."

"సంశయ నివృత్తి దేనికోసం ?"

"చెప్ప మంటారా ?"

"ఊఁ !"

"మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నానుగనుక."

"అలాగా!" అంటూ నవ్వింది.

"తేలికగా తీసుకోవద్దు. హృదయ పూర్వకంగా చెబుతున్నాను. మీకు కూడా యిష్టమైతే మనం పెళ్లి చేసుకుందాం."

"శాంతించండి. ఓ గ్లాసు మంచినీళ్లు తాగండి. ఉద్రేకంతో తీసుకునే నిర్ణయాలు ఆరోగ్యకరమైనవి కావు, శాశ్వతమైనవీ కావు."

"మిమ్మల్నెలా నమ్మించాలో నాకు స్ఫురించడంలేదు. అడుగడుగునా అపనమ్మకస్తుల్ని యెదుర్కొన్న మీకు నా నిర్ణయం మీద అపనమ్మకం యేర్పడడం సహజమే. కాని మాలతీ,

(45 వ పేజీ చూడండి)



# చిన్నారి చిలిపిచేష్టలు

'అమ్మా! అమ్మా!' అంటూ కేకలేస్తూ వచ్చింది మా బేబీ. మా బేబీకి ఐదేళ్లు. కిండర్ గార్డెన్ స్కూల్లో చదువుకుంటోంది.

'ఏమ్మా ఏమిటి హడావుడి!' అని అడిగాను.

'డాడీ చేత గుంజీలు తీయించు!' అంది.

'అదేమిటి బేబీ! పెద్దవారిని అలా అనవచ్చా?' అన్నాను.

'అది కాదమ్మా! తెల్ల కాయితాలు తీసుకు రమ్మని రోజూ చెప్తున్నా ... రోజూ మర్చి పోతున్నా అంటారు! నువ్వు కాఫీ పొడి తెమ్మంటే మర్చి పోతారు! సబ్బులు తెమ్మంటే మర్చి పోతారు!' అంది పెద్ద పేరక్కలాగా!

వాళ్ల నాన్న అక్కడే నించొని నవ్వుతున్నారు.

'అయితే ... పెద్దవాళ్లను గుంజీలు తీయమంటావా?...'

'మరి... నేను హోం వర్కు మర్చిపోతే... మా టీచర్ గుంజీలు తీయించింది. గుంజీలు తీస్తే మతి మరుపు పోతుందిట! నాకు అలాగే పోయింది!' అంది. మా వారు పకపకా నవ్వుతూ, మా బేబీని అమాంతం ఎత్తుకుని, ముద్దు పెట్టుకొని– 'రేపు కూడా మర్చి పోతే నువ్వు చెప్పినట్టు గుంజీలు తీస్తాను! ఇవాల్టికి వదిలేయ్!' అన్నారు...



శ్రీమతి వి. అపర్ణాదేవి. (ఏలూరు)




ఎమ్. ఆర్. ఎమ్., హైదరాబాదు-44.

నాకుమారుని వయస్సు 6 సం. లు. 4 సం. ల నుంచి వాడికి దగ్గు, జలుబు వస్తున్నది. జ్వరం లేదు. ఎన్నో మందులు వాడాము. కానీ ప్రయోజనం లేదు. మేము ప్రైమరీ కాంప్లెక్సు అనుకొంటున్నాము. దీనిని గురించి మీ సలహా, వాడవలసిన మందులు తెల్పండి.

* ప్రైమరీ కాంప్లెక్స్ అవునా కాదా అనేది కొన్ని పరీక్షల వల్ల తెలుస్తుంది. మాంటో టెస్టు, ఎక్స్—రే మొదలగునవివీటిలో ముఖ్యమైనవి.

ఈ ప్రైమరీ కాంప్లెక్స్ ఉన్నప్పుడు క్రమంగా స్ట్రెప్టోమైసిన్— ఐ. ఎన్. హెచ్ మాత్రలు— వైద్యుల పర్యవేక్షణ క్రింద వాడాలి. వీటి డోసు వయస్సుని బట్టిగాక, రోగి బరువుని బట్టి నిర్ణయించవలసి ఉంటుంది.

వి. యల్. హైదరాబాదు.

మాకు మొదట ఒక శిశువు గర్భంలోనే పోయినాడు. ఆ తరువాత మరల మృత శిశువు పుట్టినాడు. మా వారి వయస్సు 35 సం. లు. మా వారికి దురలవాట్లు లేవు. మాకు పిల్లలు పుట్టే అవకాశం ఉందా. దానికి మేము తీసుకోవలసిన జాగ్రత్తలు తెల్ప ప్రార్థన.

* స్టిల్ బర్త్లనబడే ఈ మృత శిశువులు జన్మించటం, ఎన్నో కారణాల వల్ల జరుగవచ్చును.

గర్భాశయపు పెరుగుదల సరిగా లేక పోవటం, శిశువు యొక్క నిర్మాణం సరిగా లేక పోవటం, తల్లికి ప్రసవ సమయంలో రాగల కొన్ని అవాంతరాలు (టాక్సీమియా), సిఫిలిస్ మొదలగునవి, ఇలా రావటానికి కొన్ని ముఖ్య కారణాలు. వీటికి తగిన చికిత్స చేయించుకొంటే తప్పక సజీవంగా శిశువులు పుట్ట గల అవకాశం ఉన్నది.

వి. జె. హన్మకొండ.

నా తల వెంట్రుకలు మిక్కిలి బిరుసుగా ఉన్నవి. చిన్నవిగా కత్తిరించినా, పెద్దవిగా పెంచినా నిటారుగా ఉంటున్నవి. చాలా క్రీములు, ఆముదం వాడితిని. ప్రయోజనం కనపడలేదు.

* వెంట్రుకలు బిరుసుగా ఉండటం, ఎక్కువగా చిన్నప్పుడే ఏర్పడుతుంది. క్రీములు వాడినందువల్ల బిరుసు ఇంకా ఎక్కువ అవుతుంది గాని తగ్గదు.

మామూలుగా కొబ్బరినూనె వాడితే మంచిది. విటమిన్ 'ఎ' మాత్రలు వాడటం, ఎక్కువ ఆకు కూరలు తీసుకోవటం వల్ల కొంత మార్పు కనబడుతుంది.

సి. హెచ్. వి. ఆర్. బాపట్ల.

మీరు లోగడ కుటుంబ నియంత్రణ గురించి ఇచ్చిన సలహాలు చదివాము. స్త్రీలు, పురుషులు వాడవలసిన పద్ధతులు, అందు హానికరం కాని వాటిని గురించి తెల్పండి.

* ఇదివరకే చాలాసార్లు దీనిని గురించి వ్రాయటం జరిగింది. కుటుంబ నియంత్రణ గురించి చెవులు చిల్లులు పడేలా ప్రచారం జరుగుతున్న ఈ రోజుల్లో, అయినా, మారు మూలల కూడా కుటుంబ నియంత్రణ కేంద్రాలు వెలిసి వున్న ఈ రోజుల్లో, ఇలాంటి ప్రశ్న పత్రికల ద్వారా తెలుసుకోవాలను కోవటం విచిత్రం.

అయినా నిరోధ్, వాసెక్టమీ పురుషులకు, డయాఫ్రమ్, పిల్స్ మాత్రలు, జెల్లీ, లూప్, ట్యూబెక్టమీ స్త్రీలకు— అనేవి ఈ పద్ధతులు.

ఎస్. జె. — మిర్యాలగూడ.

నాకు 6 నెలల క్రితం టి. బి. వచ్చింది. దానికి మందులు వాడినాను. దాని ఫలితంగా మార్పులు వచ్చినవి. దానితోపాటు చెవుడు వచ్చింది. ఇప్పుడు తలలో టక్... టక్మని శబ్దం వస్తున్నది. నాకు చెవుడు తగ్గునో లేదో అని భయంగా ఉంది.

క్షయరోగం వచ్చినవారికి ఉపయోగించే మందులు, ముఖ్యంగా స్ట్రెప్టోమైసిన్, పి. ఎ. ఎస్. మందులవల్ల, కొన్ని అవాంతరాలు రావచ్చును. అయితే ఇవి రావటం, మందుల 'డోసు', శరీర తత్వము మీద ఆధారపడి ఉంటాయి.

ఇలా రాగల అవాంతరాలలో చెవుడు, తలతిరగటం, తూలిపోవటం, చర్మములో దద్దుర్లు ఏర్పడటం, ఎక్కువగా కనిపించేది.

ఈ మందులతోపాటు, విటమిన్ బి 6, బి—1, బి—12' మొదలగునవి వాడటం వల్ల ఇవి రాకుండా చూసుకోవచ్చును. అయితే ఇది వైద్యులు తీర్మానించవలసిన విషయము.

పి. హెచ్. జి. — విజయవాడ

నా వయస్సు 20 సం. లు. 4 సం. లుగా ఆసన ద్వారం వద్ద ఎర్రగా కురుపు ఉన్నది. బాగా నెప్పి ఉన్నది. ఇది పగిలి బాగా నెత్తురు పోతూ ఉంటుంది.

పెరియనల్ ఏబ్సెస్, లేక ప్రోలాప్స్ లేక పాపిల్లోమా అనే వాటివల్ల ఇలా జరుగుతుంది. రోగ నిర్ధారణ ప్రత్యక్షంగా పరీక్ష చేసిగాని నిర్ణయించడానికి వీలుగాదు. మీరు సర్జన్లను కలుసుకొనటం మంచిది.

**ఎస్. ఎన్. బెంగుళూరు.**

మా వారికి 38 సం.ల వయస్సు. ఇంత వరకూ ఎలాంటి జబ్బూలేదు. 1 సం.గా గుండెల్లో నెప్పి వస్తున్నది. ఆయనకు 15 సం.ల వయస్సు నుంచి 'బ్రాందీ, 'విస్కీ' తాగే అలవాటు ఉన్నది. చేతులు కాళ్ళు, పీకుతాయి అంటారు. బర్మాలో ఉండేవారు.

★మీ వారిని నెత్తురులో వి. డి. ఆర్. ఎల్. పరీక్ష, బ్లడ్‌షుగర్, మూత్రపరీక్ష చేయించుకో మనండి. త్రాగుడు అలవాటు ఉన్నవారికి మందులు వ్రాస్తే మాత్రం పనిచేస్తాయా ! పైన చెప్పిన పరీక్షల ఫలితాలను వైద్యులకు చూపించి వారి సలహాల ప్రకారం మందులు వాడండి.

**ఆర్. ఎస్. యన్. కలకత్తా–43.**

మా పాప వయస్సు 5 సం. లు. 3 సం. లుగా కడుపు నొప్పిగా ఉంటున్నది. దీనికితోడు విపరీత మైన కాళ్ళ నొప్పులు. ఆకలి ఉండదు. క్రిము లకు మందు యిచ్చాము. తగ్గినట్లే తగ్గి తిరిగి వచ్చాయి. హోమియోపతి డాక్టరుకు చూపిస్తే అమీబిక్ డిసెంట్రీ అని మందులు ఇయ్యగా కాళ్ళ నొప్పులు తగ్గినవి. ఆకలి కూడా ఉంది. వారం రోజులుగా తిరిగి నడుం నొప్పి రావటం జరుగుతున్నవి. లావుగా ఉండే మా పాప చాలా సన్నబడింది.

* ఈ లక్షణాలు ఉన్నవారు మలపరీక్ష చేయించు కోవటం చాలా అవసరం. 'అమీబియాసిస్' అనే 'అమీబా'లు జీర్ణాశయంలో ఉన్నప్పుడు తరచూ రక్తవిరేచనాలవటం, మందకొడిగా ఉండటం, తరచూ జ్వరం రావటం జరుగుతుంది.

ఒకసారి మలపరీక్షలో వివరాలు తేలకపోతే మళ్ళీ పరీక్ష చేయించి, రోగ నిర్ణయం జరిగిన తరువాత ఫ్లాజైల్, ఫారిన్‌డిన్ మాత్రలు పూటకి ఒకటి చొప్పున వరుసగా 10 రోజులు వాడి తిరిగి మలపరీక్ష చేయించుకుని, మలంలో ఈ క్రిములు లేవని నిర్ధారణ చేసుకోవాలి. ●

---

"ఇదే 'చిన్నారి చిలిపి చేష్టలు' శీర్షికకు రాసి పంపిద్దామా ండీ ?"



**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

రచనలు, వ్యాసాలు, బొమ్మలు, ప్రశ్నలు, సందేహాలు మొదలైనవన్నీ పంపవలసిన చిరునామా:

సంపాదకుడు,
ఆంధ్ర సచిత్ర వారపత్రిక,
గాంధీనగరం, విజయవాడ–3.
వ్యక్తులపేర పంపరాదు. సం.

# వారఫలం

—మహేష్—

## 31-5-1974 శుక్రవారం మొదలు 6-6-1974 గురువారం వరకు

మేషం :— మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులేమిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ఆందోళనకు గురి కాగలరు. స్త్రీలకు —ఆరోగ్యం బాగుండదు. విలాసవస్తువులు కొంటారు.

వృషభం :— వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభించగలదు. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఇతరుల నిమిత్తం ప్రయాసకు గురి కాగలరు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి పుణ్యకార్యాలు చేస్తారు.

మిథునం :— వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు. కొన్ని వ్యవహారాల్లో మీరు అనుకునేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

కర్కాటకం:— మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా, వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు —దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

సింహం :— వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

కన్య :— మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. నూతన విషయాలు తెల్సుకొంటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్త్రీలకు —కుటుంబవ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

తుల :— మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

వృశ్చికం:— అనవసరమైన శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు— అధిక వ్యయం చేస్తారు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

ధనుస్సు :— మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

మకరం :— మీ కంటే పెద్దవారుకూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. రావలసినడబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు — పుణ్యకార్యాలు చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

కుంభం :— వ్యాపారంలో అనుకూలవార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

మీనం :— ఆందోళన కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. సంతోషకరమైన సమాచారం అందుతుంది. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. విలాసవస్తువులు కొంటారు.

# తక్షణము సౌఖ్యమునిచ్చే పౌడరు:




క్రొత్త

జాన్సన్స్*

# మెంథొలేటెడ్ పౌడరు

వేసవి కాలము వచ్చింది. దానితో బాధలనూ తెచ్చింది. మీకు చెమటపడుతుంది, ఉక్కపోస్తుంది, చికాకుతో గిజగిజలాడతారు. ఇప్పుడు, వేసవి వేడిని పోగొట్టుటకు ఒక సత్వరమైన, క్రొత్త పద్ధతి ఉంది. అదే జాన్సన్స్ మెంథొలేటెడ్ పౌడరు. వెంటనే ఉపశమనమును కలిగిస్తుంది. కొంచెము పౌడరును జల్లుకోండి. ఒళ్లంతా జల్లుకోండి. మెంథాల్ యొక్క చల్లదనపు అనుభవము మీకు తక్షణమే కలుగుతుంది ఎందుకంటె, అది చెమటను పీలుస్తుంది, వేసవిలో కలిగే చెమటకాయల మరియు యితర అసౌఖ్యములనుండి మీ చర్మమునకు ఉపశమనము కలుగుతుంది. జాన్సన్స్ మెంథొలేటెడ్ పౌడరు— తక్షణము సౌఖ్యమునిచ్చే క్రొత్త పౌడరు. రోజంతా సౌఖ్యముగా ఉంచుటకు దానిని క్రమంగా వాడండి. జాన్సన్స్ మెంథొలేటెడ్ పౌడరును నేడే కొనండి. ఇంత మంచి పౌడరు ఉండగా వేసవిలో ఎవరూ బాధ పడకూడదు.

**తక్షణము సౌఖ్యమునిచ్చే పౌడరుతో వేసవి బాధలను పోగొట్టుకోండి.**

* ట్రేడ్ మార్కు కాపీరైట్ జాన్సన్ & జాన్సన్

జాన్సన్ & జాన్సన్

# బంగారుకలలు

## యద్దనపూడి సులోచనారాణి

33

(గత సంచిక తరువాయి)

రాధ – వేణుల వివాహం పల్లెటూరులో, పురుషోత్తం గారి యింట్లోనే, నిరాడంబరంగా జరిగింది! పెళ్లి హఠాత్తుగా కుదిరిందని, తన దగ్గర కానీ డబ్బు లేదని చిదంబరం బలబలబలాడటంతో ఆ ఖర్చంతా రవి నెత్తినే పడింది. జ్యోతి సమయానికి వచ్చి, పెళ్లి పెత్తనం అంతా తనమీద వేసుకుని, ఆ యింట్లో ఆడపిల్ల లేని లోటు తీర్చింది.

భోజనాలు అయినాయి! వచ్చిన అతిధులంతా వెళ్లిపోయారు.

ముందు సావిట్లో చిదంబరం బల్లమీద కూర్చొని పంచెతో కళ్లు వత్తుకుంటున్నాడు.

'అయిపోయింది! ఆడపిల్లకి పెళ్లి అయే వరకూ ఒక ఆరాటం! తీరా అయిపోయిం తర్వాత అయ్యో వెళ్లిపోయిందేనని బాధ!' అన్నాడు.

'ఎక్కడి కెళ్లిపోయిందయ్యా! వూళ్లో నీ కంటి కెదురుగానే వుంటుందిగా!' అన్నారు పురుషోత్తం.

'చిన్నప్పటినుంచీ దాన్ని వదిలి ఒక్క క్షణం వుండలేదు. ఎంతరాత్రికి తిరిగివచ్చినా, నా భోజనం కోసం అట్లా మేలుకుని కూర్చొనేది! లేచినా లేవకపోయినా యిక నాకెవరు దిక్కు బావా! ఈ పిచ్చిపిల్లతో నా బ్రతుకు ఎట్లా తెల్లవారాలి!'

'బాధపడకు మామయ్యా! మాకుమాత్రం ఎవరున్నారు? నువ్వు ఒక్కడివీ ఏం అవస్థపడతావు? నువ్వుకూడా చిట్టిని తీసుకుని రాధతోపాటు వచ్చెయ్. నాదగ్గరే వుందువుగాని.' అన్నాడు రవి.

'పోనీ ఆ పని చెయ్యవయ్యా! కూతురుని వదిలి వుండలేని నీ బెంగ తీరుతుంది!' అన్నారు పురుషోత్తం.

చిదంబరం ముఖం వికసించింది. కానీ ఆ ఆనందం పైకి ప్రదర్శించలేదు.

'ఏమిటి బావా! ఆడపిల్ల అత్తారింటిలో వుండడం అంటే—'

'అదేమిటి మామయ్యా! నిమ్మబట్టేగా రాధ! నువ్వు మనసులో అలాటి శంకలేమీ పెట్టుకోకు.' అన్నాడు రవి.

ఇంతలో జ్యోతి అక్కడకు వచ్చింది. 'అంకుల్ యింక నేను వెళ్తాను. సాయంత్రం యింటికి గెస్ట్స్ వస్తున్నారు.' అంది.

'మంచిదమ్మా! నాన్న రానందుకు నాకు చాలా కోపం వచ్చిందని చెప్పు.'

'చాలా అంటే ఎంత అంకుల్!' జ్యోతి నవ్వుతూ అడిగింది.

'చాలా అంటేనా? ఈసారి మీ నాన్న కనిపిస్తే నమిలి మింగేసేటంత!'

'అదీ! అలాగని చెబుతాను.'

అక్కడున్న అందరూ ఫక్కుమని నవ్వారు.

'ఉండు జ్యోతీ! నేనూ వస్తున్నాను!' రవి లోపలికి వెళ్లి చెప్పులు వేసుకువచ్చాడు. 'నాన్నా! రేపు ఇన్‌కమ్‌టాక్సు వాయిదా వుంది. నేను సిటీ వెళుతున్నాను.' అన్నాడు.

జ్యోతి డ్రైవింగ్ సీటులో కూర్చోపోయింది.

'తమరు జరగండి అవతలకి' అన్నాడు రవి.

జ్యోతి ముఖం వికసించింది.

రవి కూర్చుని కారు స్టార్ట్ చేసాడు.

కొద్ది దూరం వచ్చిన తర్వాత జ్యోతి అంది.

'థ్యాంక్స్!'

'ఎందుకు?'

'వెంట వస్తున్నందుకు!'

'నేనే నీకు థ్యాంక్స్ చెప్పాలి. ఒకటి నాకు లిఫ్ట్ యిస్తున్నందుకు! రెండోది ఈ రోజు నువ్వు మా యింట్లో అంత కష్టపడినందుకు.'

''చాల్లే! ఈ రోజు కాకపోతే రేపయినా యీ యింటి బాధ్యత నాది కాదా!'

'జ్యోతీ!'

'నీ మంకుపట్టు మూలంగా, ఈ రోజున నేను కేవలం నీకు స్నేహితురాలిగానే యీ యింట్లో తిరగాల్సి వచ్చింది. ఆనాడే నేను చెప్పినట్టు విని, మన పెళ్లికి ఒప్పుకునివుంటే, యీ క్షణంలో నేను పెద్ద కోడలిగా పెత్తనం చేసి వుండేదాన్ని!'

'జ్యోతీ!' రవి చెయి జాచి, జ్యోతి చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

'యిప్పటికైనా నీ వ్రతం తీరిందా అని!' సందేహంగా చూసింది.

'తీరిపోయింది జ్యోతీ! నేను ఆలోచించాను. యిక నీ యిష్టం. నువ్వెప్పుడు అంటే అప్పుడే!'

'నిజంగా! అయితే యిప్పుడే వచ్చి నాన్నని అడుగు.'

జ్యోతి తొందరకి రవి ఫకాల్న నవ్వాడు.

'యిప్పుడేనా?'

'ఆ! యిప్పుడే! లేకపోతే నువ్వు మళ్లీ ఏదో సాకు చెబుతావు బాబూ!'

'సరే! అడిగేస్తాను? అసలు విషయం చెప్పటం మర్చిపోయాను. నేను రేపు మద్రాస్ వెళుతున్నాను. అక్కడ నుంచి ఎల్లుండి సింగపూర్ వెళుతున్నాను.

'అవునా?' జ్యోతి ముఖంలో నిరుత్సాహం వెల్లువలా వచ్చింది.

'మళ్లీ ఎప్పుడు వస్తావు?'

'అక్కడ పని కాగానే రెక్కలు కట్టుకుని ఎగిరి వస్తాను!'

జ్యోతి తల అతని భుజంమీద ఆనింది. రవి జ్యోతి నడుం చుట్టూ చేయి వేసి దగ్గరకు తీసుకున్నాడు.

'అబ్బా! ఈ రాత్రికే పెళ్లి అయిపోయి—నేను కూడా రేపు నీతో వచ్చేస్తే ఎంత బాగుండును! రవీ —'

'ఏమిటి జ్యోతీ!'

'నేను చాలా అదృష్టవంతురాలిననిపిస్తోంది. చాలా ఆనందంగా వుంది.'

'నాక్కూడా! రేపు ఎయిర్‌పోర్ట్‌కి రా జ్యోతీ!'

'రాకుండా వుండగలనా!'

కారు యింటిని సమీపిస్తుండగా జ్యోతి జరిగి సరిగ్గా కూర్చుంది.

'నాన్నగారిని అడిగేసేయ్! ఆలస్యం చేయకు.' అంటూ హెచ్చరించింది.

'అలాగే!' అన్నాడతను.

**జరిగిన కథ: 12** రవి, వేణు పురుషోత్తంగారి కుమారులు. సరోజ, డాక్టర్ ప్రసాద్‌లు కూడాపురుషోత్తంగారివద్ద పెరిగారు. స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్‌లో ఉద్యోగానికి హైదరాబాద్ వెళ్లిన రవి పురుషోత్తంగారి చిన్ననాటి స్నేహితుడు రాజారావుగారినీ, వారమ్మాయి జ్యోతి మొదలైనవారిని కలుసుకుంటాడు. ప్రేమించిన శేషగిరిచే మోసగింపబడి ఆత్మహత్యకు పూనుకున్న సరోజ ఎలా క్లబ్ డాన్సర్‌గా మారిందీ రవికి చెప్తుంది. చిదంబరం ఇంట్లో చదువుకని ఉంచితే, రాధతో చనువు పెంచుకుంటుంటాడు వేణు. సరోజ కూతురు ఉమని పెంచటానికి తీసుకు వెళ్తాడు రవి. రాజారావుగారి సహాయంతో ఫ్రూట్ కానింగ్ ఇండస్ట్రీ స్థాపిస్తాడు రవి. జైలు నుంచి విడుదలయిన శేషగిరి కారులో వెళ్తున్న సరోజని చూస్తాడు. సరోజ సంపాదనంతా కాజేసాడని రవిని నిందిస్తాడు శేషగిరి. ఫ్యాక్టరీ పైకి వచ్చేదాకా జ్యోతితో తన వివాహాన్ని వాయిదా వేస్తాడు రవి. సరోజ 'సర్వ్' కావాలనుకుంటుంది. చిదంబరం ఎలాగైనా రాధను వేణు కిచ్చి పెళ్లి చేయాలనుకుంటాడు. రవిని 'ఏప్రిల్ ఫూల్'ని చేస్తుంది జ్యోతి. రాధ, వేణుల వివాహం జరిపిస్తాడు రవి. చిదంబరం ప్రోద్బలంతో శేషగిరి నాటిన విషబీజంతో రాజారావుగారు జ్యోతికి వేరే సంబంధం చేయ నిశ్చయిస్తారు.

## 34

రాజారావుగారు జమునాబాయికి, ఆవిడ కొడుకు మోహన్‌కి స్వయంగా టీ కప్పులు అందిస్తూ, 'యింటి విషయాలన్నీ మా అమ్మాయే చూసుకుంటుందండీ! నే నెప్పుడు ఏ వేళకి ఏది తినాలో అంతా తన ఆర్డరే!' అంటున్నారు.

అక్కడ టేబిల్ మీద ఖాళీగా వున్న ప్లేట్లు చూస్తే, వాళ్లు అక్కడికి వచ్చి చాలా సేపయిందని, టిఫెన్ ముగించి, టీ తాగుతున్నట్లుగా తెలుస్తోంది.

రాజారావుగారు జ్యోతి చిన్ననాటి ముచ్చటలు ఏకరువు పెడుతుంటే, జమునాబాయిగారు ప్రసన్నంగా తల వూపుతూ, 'అయితే ఒక్క అమ్మాయి అయినా గారాబంతో పాడుచేయకుండా, బాగా క్రమశిక్షణతో పెంచారన్నమాట!' అంది.

జ్యోతిది చాలా స్నేహ స్వభావం అని, ప్రాణ స్నేహితురాలి పెళ్లి అవటంతో, ఒక్క నిముషం కనిపించి వచ్చేస్తానని వెళ్లిందని, యిప్పుడే వస్తుందనీ ఆయన చెప్పారు.

సరళ స్వభావురాలయిన జమునాబాయి అన్యధా తలచలేదు.

'అలా స్నేహానికి ప్రాణం యిచ్చేవాళ్లంటే తనకి చాలా యిష్టం' అని ప్రశంసించింది.

జమునాబాయిగారి కుటుంబం చాలా పరువు ప్రతిష్ఠలు కలది. మోహన్ విదేశాలు వెళ్లి చదివి



వచ్చాడు. రాజారావుగారికి ఈ సంబంధం ఖాయం చేయాలని వుంది.

'అదుగో! నేను చెప్పలా? మా అమ్మాయి టైమ్‌ని పంక్చువల్‌గా పాటిస్తుంది. రానే వచ్చింది.' అన్నారాయన వుత్సాహంగా.

కారులో నుంచి జ్యోతి దిగింది. జ్యోతి వెంట రవి కూడా దిగాడు.

అతన్ని చూడగానే రాజారావుగారి ముఖం మ్లానమైంది. కానీ అది క్షణికం మాత్రమే!

హాలులో అడుగు పెట్టగానే, కనిపించిన అతిథులని చూసి, జ్యోతి—రవి ముఖాలు చూసుకున్నారు.

'జ్యోతి రామ్మా! వీరు జమునాబాయిగారని—'

'ప్రసిద్ధ సోషల్ వర్కర్. తెలుసు నాన్నా!' జ్యోతి నవ్వుతూ ఆవిడకి నమస్కరించింది.

'యితను వారి అబ్బాయి మోహన్!'

'గ్లాడ్ టు మీట్ యూ!' అన్నాడు మోహన్.

రవిని రాజారావుగారు పలకరించలేదు! కూర్చోమని అనలేదు! అసలతనివైపు చూడనేలేదు.

'నాన్నా! రవి—' జ్యోతి ఏదో చెప్పబోతుంటే రాజారావుగారు ఆ మాటల్ని తుంచేస్తూ, 'మోహన్ చాలా సంస్కారం గలవాడమ్మా! రత్నంలాంటి వాడు! మోహన్‌లాటి కుర్రాడు కోటిమందిలో ఒకరుకూడా వుండరు. అతనికి యింకా పెళ్లి కాకపోవటం నా అదృష్టం అనుకుంటున్నాను! ఐయామ్ వెరీ వెరీ హేపీ!'

జ్యోతికి క్షణంలో వాళ్లెందుకు వచ్చారో అర్థమైపోయింది!

తండ్రి రవిని గుర్తించటం వూరుకోవటం, వాళ్లకి పరిచయం చేయకపోవటం చూసి కోపం వచ్చింది. అతనికి జరిగిన అవమానం తనకి జరిగినట్టే భావించింది. రవిని వాళ్లకి తనే పరిచయం చేయటానికి నిశ్చయించుకుంది!

'రా! రవీ! అక్కడే నిలబడిపోయావేం? వీళ్లు మనకి బాగా తెలిసినవాళ్లే!' జ్యోతి మోహన్ వైపు తిరిగింది.

'ఇతను రవి. మా నాన్నగారి ప్రాణమిత్రుడి కొడుకు. మై వుడ్‌బి హస్‌బెండ్!'

సంతోషంగా కరచాలనం చెయ్యబోయిన మోహన్ చటుక్కున ఆగిపోయాడు!

జమునాబాయి వులిక్కిపడ్డట్టుగా చూసింది.

'జ్యోతీ!' రాజారావుగారు కోపంగా పిలిచారు.

జ్యోతి తొణుకు బెణుకూ లేకుండా, నిశ్చలంగా అంది.

'అవును డాడీ! రవీ నేను పెళ్లి చేసుకోటానికి నిశ్చయం చేసుకున్నాం! ఆ సంగతే మీతో చెప్పటానికి వచ్చాడు రవి. లేస్తున్నారేం జమునాబాయిగారూ! కొద్దిసేపు కూర్చోండి. నేను యిప్పుడేగా వచ్చాను!'

రాజారావుగారి శరీరంలో ప్రతి రక్తబిందువూ మరిగినట్టయింది.

'జ్యోతీ! నీకేమైనా మతివుందా?' పళ్ల బిగువున అన్నారు.

'లేదు డాడీ పోయింది! రవి నన్ను పెళ్లి చేసుకుంటానని అన్న క్షణంనుంచీ నాకు మతిపోయినంత ఆనందంగా వుంది! బ్లెస్‌మీ డాడీ!'

'నోర్మూయ్!' ఆయన గర్జించారు.

జమునాబాయి యిక వూరుకోలేకపోయింది. 'ఎందుకండీ! ఆ అమ్మాయిని అలా కసురుతారు! మీరు చాలా పెద్దమనిషి అని, సంస్కారంగలవారని అనుకుంటున్నాను! కన్నబిడ్డ మనసు తెలుసుకోలేని మీరేం తండ్రండీ! యిప్పుడే మీరే అన్నారుగా. మా అమ్మాయికి అన్నీ తెలుసునని. మీ అమ్మాయి తనకి యిష్టం అయినవాడిని తనే ఎన్నుకున్నట్టుంది. చక్కగా, వెంటనే ముహూర్తం చూచి పెళ్లి చేసేయండి. మోహన్! పోదాం! రా!' అన్నారావిడ.

మోహన్ లేచాడు. చేతిలో అమృతం జారిపోయినట్టుగా వుంది అతనికి.

రవిని దాటి వెళ్లేముందు 'కంగ్రాచ్యులేషన్స్.' అన్నాడు వ్యంగ్యంగా.

'థ్యాంక్‌యూ!' అస్పష్టంగా అన్నాడు. అతనికి యిదంతా మతిపోయినట్టుగా వుంది. అతను అనుకున్నది వేరు. తీరా యిక్కడికి వచ్చిన తర్వాత, జరిగింది వేరు.

వాళ్లు వెళ్లిపోగానే రాజారావుగారు దెబ్బతిన్న పులిలా కూతురివైపు తిరిగారు.

'జ్యోతీ!'

'ఏమిటి నాన్నా!'

'నీకేమైనా బుద్ధుందా? ఏమిటి నువ్వు చేసిన పని!'

'ఏం చేసాను నాన్నా! రవి — నేను పెళ్లి చేసుకోబోతున్న సంగతి చెప్పాను. అంతేగా!'

"నోర్మూయ్! ఎక్కడ ఏం మాట్లాడాలో సమయం సందర్భం వుండక్కర్లా! ముందు నాకు చెప్పనవసరంలేదూ?"

'జ్యోతి తొందరపడినమాట నిజమే! క్షమించండి!' అనునయంగా అన్నాడు రవి.

'షటప్! ఏం ముఖం పెట్టుకుని మా ఇంటికి వచ్చావు నువ్వు?'

రవి నివ్వెరపోయాడు.

'నాన్నా!' జ్యోతి ఆవేశంగా అరిచింది.

కూతుర్ని చెయిపట్టి పక్కకు లాగారాయన.

'జ్యోతితో నీ పెళ్లి అవుతుందనే ఆశపడుతున్నావా? నీ తీయటి మాటలతో దాన్ని మోసం చేయగలవేమోగానీ, నా కళ్లు కప్పలేవు.'

'రాజారావుగారూ!' రవి ముఖం కందినట్టయింది.

'చెప్పు! జ్యోతిని పెళ్లి చేసుకుంటానని, నన్ను అడిగేముందు, నాయీ మాటకు జవాబు చెప్పు! నీ మనసులో జ్యోతికి తప్ప ఎవరికీ స్థానం లేదా? జ్యోతి తప్ప ఏ ఆడపిల్లా నీకు పరిచయం లేదా?'

'మీ రనేదేమిటో నా కర్థం గావటంలేదు.'

'అర్థం గావటంలేదా? అయితే అర్థం అయేట్టు చెబుతాను. విను! శేషగిరి అనే అతని భార్య నీకు తెలుసా?'

రవి దిగ్భ్రాంతిగా చూసాడు.

'మాట్లాడు! నీకు తెలుసా? తెలియదా?'

రవి జవాబు చెప్పలేకపోయాడు.

'మాట్లాడు! సమాధానం చెప్పు!' ఆయన అరిచారు.

'తెలుసు!'

'తెలుసుకదూ! ఆ అమ్మాయి నీ అండలో వుంటున్నదా? లేదా?'

'వున్నది.'

'ఎందుకు వున్నది? ఏమిటి మీ యిద్దరి సంబంధం?'

'డాడీ! రవీ! ఏమిటిదంతా? ఎవరిని గురించి మీరు మాట్లాడుకునేది?'

జ్యోతి యిద్దరి ముఖాలూ చూస్తూ ఆదుర్దాగా అడిగింది.

రాజారావుగారు కూతురి మాట వినిపించుకునే స్థితిలో లేరు.

ఆయన రవినే నిశితంగా చూస్తున్నారు.

'పెళ్లి జరిగి భర్తతో కాపురం చేసుకోవాల్సిన అమ్మాయిని, భర్త నుంచి విడదీసి, నీ దగ్గర వుంచుకోవాల్సిన అవసరం నీ కేమిటి?'

రవి మౌనంగా నిలబడిపోయాడు.

'మాట్లాడు! నిన్నే!' ఆయన రెట్టించారు.



''ఓ సీత కథ''లో రోజారమణి

విశ్వనాథ్. మాటల కర్త డి. వి. నరసరాజు. సంగీతానికి భర్త మహదేవన్. ముఖ్య పాత్రలను చలం, సత్యనారాయణ, జయంతి, భారతి, శుభ, కె. విజయ పోషించారు.

## మినిష్టరుగా చలం కలెక్టరుగా కృష్ణంరాజు

రెండువందల చిత్రాల నటుడు, నిత్య నూతన నటుడు అయిన అల్లురామలింగయ్య సమర్పిస్తున్న ''బంట్రోతు భార్య'' చిత్రంలో చలం మినిష్టరుగా, కృష్ణంరాజు కలెక్టరుగా నటించారు.

ఆడది పట్టుపడితే, సాధించి తీరుతుంది అని బంట్రోతు భార్య నిరూపించింది. ధనంతో ఏదయిన చెయ్యొచ్చు అని కలెక్టరు భార్య వాదిస్తుంది. కృషితో ఏదయినా పొందవచ్చు అని బంట్రోతు భార్య చేసి చూపించింది.

ఈ చిత్రంలో అల్లురామలింగయ్యది గమ్మత్తయిన వేషం. సూర్యకాంతం గెస్టుగా కనిపించినా, బెస్టుగా నవ్విస్తుంది. టైటిల్ పాత్రను విజయ నిర్మల సునాయాసంగా చేసింది. కలెక్టరు భార్యగా శ్రీవిద్య ధన గర్వాన్ని చక్కగా చూపెట్టింది.

ఈ చిత్రానికి దాసరి దర్శకుడు. కన్నీరు రప్పించే ఘట్టం ఒకటయినా లేకపోవడం యీ చిత్రంలోని ప్రత్యేకత. చూసినంతసేపు హుషారును, నవ్వును తెప్పించడం యిందులోని ప్రత్యేకత.

## ఇంటి అల్లుడి అఘాయిత్యం

అయినవాడని, అనాథని ఆదరించి యింటి అల్లుడ్ని చేసుకుంటే, అతగాడు భార్యను హింసించి ఆమె మెడలో గొలుసును లాక్కున్నాడు. ఆ దృశ్యం అత్తగారి కంటపడింది. పళ్లు పటపట కొరికింది. అల్లుడ్ని ఉరిమి చూసింది. ఆగక్కడ అవి గర్జించింది.

''ఇన్నాళ్లు నువ్వు చేస్తున్న నిర్వాకం యిదా ? ఏదో అనాథవిగదా అని చేరదీసి, నా కూతుర్ని ఇచ్చి పెండ్లి చేస్తే యింత అఘాయిత్యం చేస్తావా ?'' అని దబాయించింది. ఆమెను కుమార్తె వారించబోయింది. ''ఏమిటమ్మా, నీ అమాయకతని, మంచితనాన్ని ఆధారం చేసుకునేనమ్మా యిలా ప్రవర్తించాడు. భర్త గౌరవాన్ని కాపాడడం కోసం యింతకాలం ఈ రాక్షసుడి చేతిలో నరకం అనుభవిస్తున్నావా ?'' అని కుమార్తెను ఓదార్చింది. ''కట్'' అన్నారు దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి. ఈ గంభీరమైన సన్నివేశం నందినీ ఫిలింస్ వారి ''పండంటి సంసారం'' చిత్రంలో కనిపిస్తుంది. అత్తయ్యగా భానుమతి, యింటి అల్లుడిగా సత్యనారాయణ, అతడి భార్యగా మణిమాల నటించారు. కె. సుబ్బిరెడ్డి సమర్పించు ఈ చిత్రానికి జె. ఏ. రామసుబ్బయ్య నిర్మాత.

## నూరు రోజుల చిత్రం !

గోపీకృష్ణా మూవీస్ ఈస్ట్‌మన్ కలర్‌లో ప్రారంభించిన ''కృష్ణవేణి'' చిత్రం షూటింగు నూరు రోజులలో పూర్తయింది.

జనవరి యిరవైన కృష్ణంరాజు పుట్టిన రోజున శ్రీశైల మల్లికార్జునస్వామి ఆలయ ప్రాంగణంలో ప్రారంభమయిన ''కృష్ణవేణి'' చిత్రం ఏప్రిల్ యిరవై తొమ్మిది నాటికి విజయా నందనోద్యానవనంలో జరిగిన షూటింగుతో పూర్తి అయింది.



''సత్యానికి సంకెళ్లు''లో వాణిశ్రీ



''బంట్రోతు భార్య''లో చలం, కృష్ణంరాజు

ఇంత తక్కువ వ్యవధిలో యీ రోజులలో ఒక చిత్రం పూర్తిగావడం నిజంగా గొప్ప విషయమే. ఇంత త్వరగా పూర్తిగావడానికి తోడ్పడిన నటీనటులకు, సాంకేతిక నిపుణులకు తన కృతజ్ఞతలను తెల్పుతున్నాడు, ఎదుగుతున్న కృష్ణంరాజు.

చిత్రం గూర్చి ..

ఇదొక కరుణామూర్తి జీవిత కథ. జీవితంలో ఎంత సుఖ సంతోషాలను అనుభవించిందో, అంత కంత అవమానాలకు అపవాదులకు గురి అయింది. ''కృష్ణవేణి''గా వాణిశ్రీ, కథానాయకుడిగా కృష్ణంరాజు నటించారు. సహాయ పాత్రలను గుమ్మడి, అంజలీదేవి, రాజబాబు, మాడా, నిర్మల, రమాప్రభ పోషించారు. వీరమాచనేని మధుసూదన రావుకు ''విక్టరీ''ని తెచ్చిపెట్టే చిత్రం యిది. నిర్మాత చెలసాని గోపీ.

## పుట్టింటి గౌరవం !

శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ ప్రారంభించిన, నిర్మాత ఎస్. వి. సుబ్బరాజు నిర్మిస్తున్న నాలగవ చిత్రం యిది. దీని షూటింగు ఏప్రిల్ 28 న ప్రసాద్‌లో ఆరంభమైంది.

''పుట్టింటి గౌరవం'' కథను నిర్మాత వ్రాయ, మాటలను మోదుకూరి జాన్సన్ సమకూర్చ, కథ నాన్ని, దర్శకత్వాన్ని పి. చంద్రశేఖరరెడ్డి చేపట్టారు. ఈ చిత్రంలో కృష్ణంరాజు, శుభ అన్నాచెల్లెలుగా నటిస్తున్నారు. ముఖ్య పాత్రలను సత్యనారాయణ, పద్మనాభం, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు, సాక్షిరంగారావు, గోకిన రామారావు, సూర్యాకాంతం, సునందిని, నిర్మల, పండరీబాయి పోషిస్తున్నారు.

## గీత ప్రసాద్

''గీత'' చిత్రంలో కథానాయకుడిగా నటించిన, ప్రసాద్‌కి మంచి పాత్రలు అతన్ని వెతుక్కుంటూ వస్తున్నాయి. ''పుట్టింటి గౌరవం''లో ప్రసాద్ ధరిస్తున్న పాత్ర అతని గీతను మరింత బలపరుస్తుంది.

అక్టోబరు నుండి కృష్ణతో మరొక చిత్రం ప్రారంభమవుతుందని, ఆయన కాల్‌షీట్లు అర్జెంటుగా దొరకనందువల్లనే, యీ బడ్జెట్ చిత్రం ప్రారంభించడం జరిగినదని, నిర్మాత సుబ్బరాజు చెప్పారు. కృష్ణ సరసన జమున నటించే ఆ చిత్రానికి పి. సి. రెడ్డి దర్శకుడు.



''అమ్మ మనసు''లో చలం, జయంతి.

## ఒకే ముహూర్తాన మూడు పెళ్ళిళ్ళు

మదరాసు అబట్స్‌బరీ కళ్యాణ మండపంలో ఒకే ముహూర్తాన మూడు పెండిండ్లు జరిగాయి. ఆ పెళ్లిళ్లను క్యారెక్టర్ నటుడు నాగభూషణం, జరిపించారు. ఆ మూడు జంటలు ఎవరంటే : ''కృష్ణంరాజు — భారతి; చంద్రమోహన్ — పద్మప్రియ; రాజబాబు— జయసుధ.' ఈ కళ్యాణాలు ''ఆడపిల్లల తండ్రి'' చిత్రంలో కనిపిస్తాయి.

మధ్యతరగతి కుటుంబీకుడు, మామూలు గుమాస్తా ఉద్యోగి అయిన నాగభూషణం ధనవంతులు చేసే కళ్యాణ మంటపంలో పెళ్లిళ్లు ఎలా చేశాడని ఆశ్చర్యంగా వుందా ? నాకూ అలాగే అనిపించింది. ఆ మర్మం తెలుసుకోవాలంటే సినిమా చూడాల్సిందే అన్నాడు, దర్శకుడు—కథకుడు వాసు.

''ఆడపిల్లల తండ్రి'' పూర్తయింది. జూన్ 1 న మరొక కొత్త చిత్రం ప్రారంభమవుతుంది. ఆ చిత్రంలో జయసుధ నాయిక వేషం వేస్తుంది. నాయక పాత్రను పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్ ఉపాధ్యాయుడు ధరించగలడని తెలిసింది. చిరంజీవి వాసు కథ వ్రాసి నిర్మించే ఆ చిత్రానికి సినిమా అనువాదం చేసి, దర్శకత్వం అంగీకరించారు, ప్రత్యగాత్మ.

## బాధగా వుందా ?

పాఠకలోకానికి ఒక నిజాన్ని చెప్పకపోతే నన్ను నేను ఏమార్చుకొన్నట్లు అవుతుంది. నేనేదో పెద్దగా పొగడుతూవుంటానని కొందరు అంటున్నారు. మరికొందరు నాకు రాస్తున్నారు. అలాంటి వాళ్లకు నేను యిచ్చే సంజాయిషీ ఒక్కటే. అదేమిటంటే :

నేను సినిమాలు రషస్ చూసినప్పుడు కథను గూర్చి అద్భుతంగా వున్నదనిగాని, యింతవరకు రాలేదనిగాని వ్రాసినట్టు గుర్తులేదు. కథను గూర్చి నిర్ణయించవలసినది నిర్మాత, దర్శకుడు. నటించే వాళ్ల కథ నచ్చకపోతే చెయ్యడం కుదరని పని. అందరూ బాగున్నదనుకున్న చిత్రం ప్రజలకు నచ్చకపోతే, అది దెబ్బ తింటుంది. ఫలానా కథ బ్రహ్మాండంగా వుంది అని తెలిస్తే, నేనే చిత్రంగా నిర్మించి నాలుగు డబ్బులు సంపాయించుకుంటానుగా. కథ విషయంలో యిక్కడ ఎవ్వరూ విద్వాంసులు లేరు. అందుకనే నేను కథ జోలికి ఎప్పుడూ వెళ్లలేదు. ఇకపోతే ఒకటి మాత్రం నా వ్రాతల్లో కనిపిస్తుంది. అదికూడా నా కోసం కాదు. అభిమాన ప్రేక్షకుల కోసం.

ప్రేక్షకులు వాళ్ల అభిమానించే హీరోలను గూర్చి ఏవేవో వూహించుకుంటూ వుంటారు. వాళ్లను తృప్తి పరచడం కోసం, హీరోల ప్రతాపం గూర్చి కొంత అతిశయోక్తి తప్పడం లేదు. నాకు పొగడడం చేతగాక కాదు. తప్పులు చెప్పే తెలివి లేక కాదు. పొగిడినప్పుడే, యింత బాధ పడుతున్నారే, యిక వాళ్ల అభిమాన కథానాయకుల గూర్చి తప్పుగా వ్రాస్తే, ప్రేక్షకులు సహించగలరా ? వాళ్లను నొప్పించడం యిష్టం లేక, నేను నొవ్వక వుండాలనే నేను కొంత ఎక్కువగా వ్రాస్తూ వున్నాను. ఇది తప్ప మరొక ప్రత్యేకకారణం అంటూ ఏదీలేదు.

- శ్రీనివాస్



← ''రాముని మించిన రాముడు'' చిత్రం ప్రారంభోత్సవం : నిర్మాత భక్తవత్సలం, హీరో ఎన్. టి. ఆర్., దర్శకుడు గోపీనాథ్‌లు చిత్రంలో గలరు.

# విశ్రాంతి పొందండి!
# చార్మినార్ త్రాగండి.




అచ్చమైన
మేలిరకం పొగాకుల
పరిమళము కమ్మదనం
అనుభవించండి.

53*
పైసలకు
10

వి ఎస్ టి తయారీ

భారత దేశపు అత్యధికంగా అమ్ముడుబోయే సిగరెట్!

CMVS. 95/R 234-TL

* సిఫారసు చేయబడిన అధికతమ చిల్లర ధర (స్థానిక పన్నుల అనుసారం)

# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

జి. ఆర్. సికింద్రాబాదు.

● గాజు ముక్కను చూసి రత్నం అనుకున్నాను... విశ్వాసం కృతజ్ఞతలేని ఆడవారిని గురించి పొగడడం మీకే చెల్లు . . కాదంటారా ?

అహ్ దెయ్యం వేదం వల్లిస్తున్నట్టుంది— మీరు విశ్వాసం, కృతజ్ఞతా అంటూ వల్లె వేస్తూంటే ! . . . మిమ్మల్ని కన్నతల్లి ఆడది కాదా ? మిమ్మల్ని చేపట్టిన స్త్రీ ఆడది కాదా ?... మీకేవి— ఆ విశ్వాసం కృతజ్ఞతా ? !

ఎస్. ఆర్. పి. చిట్టివలస.

సుజలాం, సుఫలాం సస్య శ్యామలాం . . . ఎక్కడుందండీ ఈ భారతి ?

ఇమ్మిగ్రేషన్ వీసాతో ఫారిన్ వెళ్ళింది స్వామీ— రిపబ్లిక్ డేకి, స్వాతంత్ర్య దినానికీ, వస్తూంటుంది. ఈ మాటు వచ్చినప్పుడు చెప్పమంటారా ? !

బి. ఎన్. ఆర్. విశాఖపట్నం.

నాకు తెలియక అడుగుతున్నాను. సృష్టిలో ముందు ఆడది పుట్టిందా ? మగవాడు పుట్టాడా?

మగవాడే. ఒంటరితనాన్ని భరించలేక తోడు కావాలి బాబోయ్ అంటే అప్పుడు— ఆడదాన్ని సృష్టించాడు . . . అంచేత ఆడది మీ ఇంట అతిథి— గౌరవించాలి. ఆదరించాలి. ఆనందం పంచుకోవాలి.

డి. జె ఆర్. హైదరాబాదు.

ఎందుకండీ ఈ ప్రపంచంలో అంతా అమాయకులనే కాటేస్తారు ?

చూడు బ్రదర్, అది అమాయకుల తప్పు. ఈ ప్రపంచం కట్ల పాములాంటిది. కదిలిస్తే కాటేస్తుంది. కదలకుండా ఒడుపుగా పట్టేస్తే— నోరు మూసుకుంటుంది !

జీనియస్ అంటే ఎవరు ?

సహజమైన తెలివికి కాస్త పైత్యం జోడించిన వాడు !

చేతకానివాడు రాయకుండా వూరుకోవాలంటాను . . . మీరేమంటారు ?

పొరపాటు. అడవిలో ఏ పక్షి బాగా పాడలేనివి వూరుకోదు . . .

పి. ఆర్. ఎస్. వేములవాడ.

నవ్వును పువ్వుతో పోలుస్తారెందుకు ?

క్షణం వెల్గి వాడిపోతుంది గనుక.

నేటి విప్లవ రచయితల గురించి మీ అభిప్రాయం ?

మంత్రాలకు చింతకాయలు రాలవు. మరి మాటలవల్ల విప్లవం ఎలా వస్తుంది ?

ఎమ్. ఎస్. వి. జి. ఆర్. కటక్.

క్రిందటి సంవత్సరం మిమ్మల్ని చూశాను. మీ జడలాంటిది చూడగానే చాలా నవ్వొచ్చింది. అంత ముచ్చటపడేవారు బాబ్డ్ ఎందుకు చేయించుకొన్నారు ?

అసలే బుద్ధిమంతురాలినైన నా జుట్టు ఎప్పుడూ భుజం దిగదు. దాల్లోనే కొంత— దేవునికిచ్చాను. ఏం ఆశ్చర్యంగా ఉందా ? ! . . .

వి. సూ. నా. విశాఖపట్నం.

మీ సమస్యలు సందేహాలు ఎలా తీర్తాయట. సమస్యలు తీరిన పాఠకునిగా ప్రశ్నిస్తున్నా.

నాన్నా ! బాబీ ! నీకు నిజంగా సన్మానం చేయించాలి. చందాలు వసూలు చేస్తా !— సమస్యే లేని మనిషివని ! వో. కే ?!

ఎల్. వి. మద్రాసు.

మానవునికి అత్యవసరమైనది ఏది ?

తృప్తి.

రామకృష్ణ, మెదక్.

అంతర్జాతీయ మహిళామండలివారు—ముగ్గురు కంటే ఎక్కువ పిల్లల్ని కన్నవారికి పన్ను విధించాలని, పదకొండు సంవత్సరాలలోపు పిల్లలున్న స్త్రీలకి ఉద్యోగాలు ఇవ్వవద్దని ప్రభుత్వానికి విన్నవించుకున్నారట. ఈ పని మగవారి మీద ప్రేమతో చేసిందా ? కోపంతోనా ? లేక కనడం తప్పుతుందనా ?

మీలాంటి సంకుచితులు ఏమనుకున్నా— తప్పులేదు. కుటుంబనియంత్రణ— అన్నది ఒక సాంఘిక బాధ్యత ఈనాడు. దానితో మీ మగవారు సహకరించకపోయినా— ఆడవారేనా తాపత్రయ పడుతున్నందుకు— గర్వించడంపోయి— శంకిస్తున్నారా ? ! కనడం తప్పుతుందనా అని అడుగుతున్నారే. కనడంలో కష్టం మీకేం తెలుసు?. . . పురిటి నొప్పులు అనుభవైకవేద్యం కాని మీ వూహలకి కూడా అందవు ! అలాంటి విషయాలు —ఎప్పుడూ తేలికగా మాట్లాడ్డం దారుణం— బాధ్యతారహితం— సభ్యత లేకపోవడం !

ఎన్. జె.ఎల్.ఎమ్. జి. ఎల్ ఆర్, కళ్యాణఖని.

అసలు మనిషిని ఎందుకు పుట్టిస్తాడు ? ఎందుకు చంపుతాడు భగవంతుడు ?

పిల్లి. వయోజనులై ఉండీ ఇదేం ప్రశ్న. భగవంతుడు మనిషిని పుట్టించాలేదు. చంపడమూ లేదు. జీవరాసి పరిణామక్రమంలో రూపం దాల్చిన మానవుడు— ఇతర జీవరాసుల్లాగే నాశనం అవడంలో ఆశ్చర్యం ఏముంది ? !

కె. ఎస్. కె. విరివాడ.

హిందూ సంప్రదాయంలో బ్రాహ్మణ కులంలో పుట్టిన మీరు బొట్టు పెట్టుకొనక పోవడానికి కారణం? !

బొట్టులోనే ఉందా బ్రాహ్మణత్వం ? ! అయినా బ్రాహ్మలమని చెప్పుకుంటే కూడా మంచినీళ్ళు పుట్టని ఈ రోజుల్లో— ఎందుకు జ్ఞాపకంచేసి బాధపెడతారు ? ఏ పుణ్యాత్ముడో పేచీపడి ఈ కులాన్ని కూడా షెడ్యూల్డు తరగతుల జాబితాకి ఎక్కించడా, మా గతి బాగుపడదా అని నేను ఎదురుచూస్తున్నాను. నేను మా కులమతాల ప్రసక్తి తేకపోయినా 'మీరు బ్రాహ్మల'ని దూరం చేస్తున్నారు— ఇది చాలా అన్యాయం . . . పిపీలిక మీద బ్రహ్మాస్త్ర ప్రయోగం లాగా— చేతకాని బ్రాహ్మలమీదెందుకో— కత్తి కట్టడం— నా కర్థంకాదు.

కె. వి. యస్. గోపాలపురం.

మోక్షం పొందడానికి మార్గం ఏమిటి ?

బాధ్యతల నిర్వహణ. ●



''బంగారుకలలు''లో ఒక దృశ్యం

"అత్తగారి ఇంట్లో కోడలు ఆకులచాటు పిందెలా అణిగి మణిగి వుండాలి."

ఆ మాట వింటూనే విజయ పకపక నవ్వింది. మరి నవ్వలేక ఆయాసంతో రొప్పుతూ బలవంతానా నవ్వును దాచేసింది.

"నాన్నమ్మా ! ఓ నాన్నమ్మా ! ఆకుల చాటు పిందే ? ఆకులచాటు పిందే ?" అంటూ కిలకిల నవ్వింది.

"పెద్దంతరం చిన్నంతరం లేకుండా ఏమిటా ? యికిలింపు" సామానులు సర్దుతున్న సావిత్రమ్మ చిరుకోపంతో అంది.

"లేకపోతే చూడమ్మా ? నాన్నమ్మ మాటలు ... నేను అత్తవారింట్లో ఎలా మెలగాలో గంట నుంచీ బోధిస్తున్నదా ? అది చాలదన్నట్లు అదె ... అదె...ఆకులచాటు... హి ... హి...హీ ... పిందెలా గుండాలట." బలవంతానా నవ్వుని ఆపుకొని చెప్పింది విజయ.

సావిత్రమ్మ కూతురు వైపు చూసి ఓ నిట్టూర్పు విడిచి తిరిగి సామానులు సర్దడంలో మునిగిపోయింది.

"పిచ్చిపిల్ల ! ఎలావుంటావో ఏమో ?" నాయనమ్మ మనుమరాలి ముందు భవిష్యత్తు ఆలోచిస్తూ అంది.




# కురుమద్దాలి విజయలక్ష్మి

# కొత్త కోడలు

"నాన్నమ్మా ! నువ్వు మొదట కాపురానికి వచ్చినప్పుడు ఆకులచాటు పిందెలానే వున్నావా ?" విజయ తెచ్చిపెట్టుకున్న అమాయకంతో అడిగింది.

"ఇంత అమాయకురాలివి ఎలా వుంటావో ఏమో ? యీ కాలం వలె ఆనాడు మేముండే వారమా ? అత్తగారు అంటే పెద్ద పులి అనుకొని భయపడి చచ్చేవాళ్లం. మొగుడితో పగలు మాట్లాడేదే లేదనుకో, నలుగురు పిల్లల తల్లులయింతరువాత పగలు పది మంది ఎదుటా ఎంతో అవవసరం అయితే ఒక్క మాట మాట్లాడే వాళ్లం. ఈ కాలంలో లాగా మూడుముళ్లు పడుతూనే సినిమాలు షికార్లూనా ? అయ్యోరాత" నాయనమ్మ తం నీడలు గుర్తు తెచ్చుకుంటూ అంది.

ఆ మాటలకు విజయ నవ్వుకుంటూ గదిలోకి వెళ్లిపోయింది.

"ఆడదానికి యింతనవ్వు మంచిది కాదు. పిచ్చి పిల్ల ! ఎలా వుంటుందో ఏమో ?" నాన్నమ్మ విజయ గురించి దిగులుగా అనుకుంది.

"దేనికయినా నాలుగు రోజులు అలవాటు అయితేసరి అన్నీ తెలిసివస్తాయి" సావిత్రమ్మ అంది నిర్లిప్తంగా.

విజయగురించి సావిత్రమ్మకు లోలోపల దిగులుగానే వుంది. పైకి గాంభీర్యంగా వుంది కాని... విజయమాటకు ముందు పగలబడి నవ్వటం ఆడ మగ ఎవరైనా సరే దబాయించి మాట్లాడటం. చిలిపి పనులు చేయటం అవతలి వాళ్లను టక్కరితనంతో ఏడ్పించటం, యీ లక్షణాలు అత్తవారింట్లో అపార్థాలకు

దారి తీయవచ్చు. యీ విషయాలు తప్పించి అన్నీ బాగానే వున్నాయి. చక్కగా పని పాట, వంటా పెట్టు. అవలీలగాచేసి పారేస్తుంది.

మరో గంటకు ప్రయాణంఅయి మర్నాడు వుదయానికి అత్త వారింట్లో కొత్త కోడలిగా కాపురానికి కాలు పెడుతుంది విజయ.

అంతకు రెండు రోజుల క్రితం నుంచీ నాన్నమ్మ ఆడ పిల్ల ముఖ్యంగా కొత్తకోడలికి వుండాల్సిన వినయ విధేయతల గురించి నూరి పోస్తూనే వున్నది.

"ఇదేం పూర్వకాలమా? ఓ పద్ధతిలో సంసారాలు నడుస్తాయా? మనం చెబితే వాళ్ళు వినేరోజులా?" సావిత్రమ్మ కూతురు గురించి లోలోపల అనుకుంది.

"అత్తవారిల్లు అంటే కాకులు దూరని కారడవా? జేమ్స్‌బాండ్ పిక్చరా? భయపడటానికి" విజయతల ఎగర వేస్తూ అనుకుంది.

"నాన్నమ్మా? ఆకులవాటు పిందె కదూ అన్నావ్ గుర్తుంది" అంటూ రిక్షా ఎక్కింది విజయ.

అత్తవారింట్లో అడుగుపెట్టిన విజయకు అంతా కొత్త కొత్తగా వుంది. తనకు తెలియకుండానే రవంత భయము, మౌనము ఆక్రమించుకున్నాయి విజయను.

అత్తగారినిచూసి అందరూ భయపడే వారే కనిపించారు ఆ ఇంట్లో.

మామగారి నోట్లోంచి పల్లెత్తు మాట కూడా వినపడదు. శాల్తీ కనపడితే తప్ప ఆయన ఇంట్లోవున్నట్టు ఎవరికీ తెలియదు.

బావగారు మామగారికి డిటో. పోతే.... తోడికోడలు విమల ప్రతి దానికీ భయపడి పోతూ గాభరా పడుతూ వుంటుంది. ఉత్త పుణ్యానికి కంగారు.

భర్త సరేసరి అమ్మకు చిన్నకొడుకేమో గారాలుపోయి డబ్బు లాగుతుంటాడు సినిమాలకు సిగరెట్లకు వగైరాలకు.

అన్నింటికన్నా విజయను ఆకర్షించింది అనవసరంగా అత్తగారికి ప్రాముఖ్యం. అతి వాగుడును.

పనిమనిషి ఓ పూట మానేస్తే మర్నాడు దానిని చూస్తూనే... "ఏమే అప్పలూ! నీ పేటలో ఎవరి కొంప అంటుకుపోయింది. లేక తిన్నది అరగక అజీర్తి చేసిందా? రెస్టు తీసుకోవాలనిపించిందా? యివాళా రెస్టు తీసుకోలేకపోయావా? ఒక్క రోజులో ఏం బలం పట్టేను?" అంటూ... పనంతా పూర్తి అయి పనిమనిషి వెళ్లేలోపల కామా పులిస్టాపు లేకుండా లేకలేస్తూనే వుంటారు. చివరకు అది వెళ్లేటప్పుడు "ఎందుకే అప్పలూ! నిన్నరానిది?" అంటూ శాంతంగా అడగటం... అది. పిల్లవాడికి జొరం వచ్చింది అనంగానే... "అయ్యో, అయ్యో! జ్వరం వచ్చినవాడిని ఎలా వదలి రాబుద్ధయిందే? నీదసలు తల్లి ప్రాణమేనా అంట?" అంటూ నాలుగు చివాట్లువేసి "రేపు జ్వరం తగ్గితేనే పనిలోకి రా" అంటూ పంపిస్తారు.

విజయకు ఆ ధోరణి చూస్తుంటే నవ్వాలో ఏడ్వాలో అర్థంకాలేదు. కాని మరొకటి అర్థం అయింది. అత్తగారు తాను అనుకున్నంత కఠినురాలు కారని బోళామనిషి అని.

ఓ రోజు రాత్రి... "సెవెంటీ యమ్. యమ్. ఇంగ్లీషు పిక్చర్‌కు వెళదామా?" అని భర్తను అడిగింది విజయ.

"అమ్మ నెలకు రెండు పిక్చర్లకైన చూస్తే పూరుకోదు పై నెల వెళ్దాము" బుజ్జగింపుగా అన్నాడు కృష్ణమూర్తి.

"బాగుంది. మీ అమ్మగారు ఆర్డరు యిచ్చేసరికి ఆ పిక్చర్ తుస్ మంటుంది. ఆవిడకు మీరు నచ్చచెప్పండి." గారాలు పోతూ అంది విజయ.

"అమ్మ తత్వం తెలిసి నాఅంతట నేను అడగను. నీవయినా గట్టిగా మాట్లాడి అమ్మ మనసు ఒప్పించవచ్చు..." అంటూ అమ్మ గురించి గంట లెక్చరిచ్చాడు కృష్ణమూర్తి.

విజయ కసిగా పెదవి కొరుక్కుంటూ ఆలోచనలో పడిపోయింది.

"అత్తగారి మనసు కష్టంలేకుండా ఒప్పిస్తే..." అంది.

"చాతయితే చూడు, ఒకేత్రాటిపై నడుస్తున్న యీ సంసారం కకావికలు కాని యకు, అదే నిన్ను కోరేది" అన్నాడు.

కృష్ణమూర్తి మాటలు కొరివికారంలా మండినా చిరునవ్వుతో "నేను అంత మూర్ఖురాలిని కాదు. మంచిగానే అత్తగారిచేత 'మీ యిద్దరు పిక్చర్‌కు వెళ్ళండి' అనిపిస్తాను" అంది.

"అప్పుడు నీఅంత తెలివిగలది ఎవరూ లేరని మాంచి బహుమతి యిస్తాను."

కృష్ణమూర్తి అనంగానే తల ఎగర వేసింది విజయ.

మామగారి పింఛను వంద, బావగారి జీతం అయిదు వందలు, భర్త జీతం ఆరు వందలు ఫస్టు తారీకు రాత్రేఅత్తగారి చేతిలో పోస్తారు. ఆ డబ్బుని గాడ్రెజ్ బీరువాలో భద్రంచేసి ఇంటి ఖర్చులు దగ్గర నుంచీ మొగవాళ్ళ సాదరు ఖర్చు, సినిమాలు, సాయంత్ర పూలు అన్నీ ఆవిడయిష్టం ప్రకారం జరగాల్సిందేను.

"ఆరువందల జీతగాడు తన భర్త. మనసారా ఓ పిక్చర్ చూడాలంటే గతి లేదు ఛీ... ఛీ" అనుకుంది విజయ.

"ఛాలెంజి చేసినట్లే తన భర్త మాట్లాడారు. తాను ఓడి పోరాదు, సంసారం కకావికలు చేయటానికి తనేం మూఢురాలా? దుర్మార్గురాలా మంచితనంతోనే సాధిస్తాను" అనుకుంటూ వంటగదికేసి నడిచింది.

అత్తగారు ఓ పక్క చపాతీలు వత్తుతూ అవతల వంటచేస్తూ వుండటం కనపడింది. ఒకేసారి రెండు పనులతో సతమతమయి పోతున్నది. విజయకు జాలివేసింది.

ఇంట్లో చెట్టంత యిద్దరు కోడళ్లను



# కొత్త కోడలు

పెట్టుకుని ఆవిడ శ్రమపడటం. అంతా తానే చేస్తానని గొప్పకా? లేక అతి మంచితనమా? అర్థంకాలేదు.

"చపాతీలు నేను వత్తుతాను. వంట మీరు చూడండి అత్తయ్యగారూ" అంటూ పనిలో జొరపడింది. ఆవిడ వద్దు వద్దు అంటున్నా.

అత్తగారి మనస్తత్వం బాగా తెలుసుకోవాలంటే ఆవిడకు వీలయినంత దగ్గరకు పోవటమే అనుకుంది. గబగబ చపాతీలు వత్తి కాల్చటం మొదలు పెట్టింది మౌనంగా.

"చాలా చక్కగా చేస్తున్నావు. వంటబాగా తెలుసులాగుంది"

అత్తగారు అనంగానే విజయగుండె గుభేల్మంది. ఖర్మ రేపటినుంచీవంట కూడా చేయమంటుంది కామాలి. యిది ముందరి కాళ్లకు బందాలేమో?

"నెమ్మదిగా వంట నేర్పుదామని అనుకుంటున్నాను. ఆ అవసరం లేదన్నమాట, వంట చాతయిన ఆడదానికి కష్టమే లేదనుకో!" అంటూ వంటలోనికష్ట సుఖాలు చెప్పటం మొదలు పెట్టింది అత్తగారు.

అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన కృష్ణమూర్తి "విజ్జీ"అంటూ కేక పెడితే ఓ సారి వెళ్లి వచ్చి తిరిగి చపాతీలు చేయటంలో పడిపోయింది. మరో పది నిమిషాలు ఆగి మళ్ళీ పిలిచాడు కృష్ణమూర్తి విజయను.

"వాడు పిలుస్తుంటే వెళ్లవేమిటే, ఆ పని నేను చేసుకుంటాను వెళ్లు" అంది అత్తగారు.

విజయ కదలలేదు. అప్పుడే ఒక చిలిపి వూహ కూడా కలిగింది.

"అదేదో ఇంగ్లీషు సినిమా యివాళతో వెళ్లిపోతోంది. వెళదామని అమ్మని అడుగు అంటున్నారు అత్తయ్యా! పదిరోజుల క్రితమే కదా సినిమా చూచాము. వద్దంటాను నేను" అంది విజయ ఎంతో సహజంగా.

ఆ మాట వింటూనే ఒక్క క్షణం ఆలోచించింది. వెంటనే "కిష్ణా!"అంటూగట్టిగా కేకవేసి పిలిచింది.

విజయ ప్రాణాలు పైనే పోయాయి. తాను అబద్ధం ఆడినట్లు తెలిసిపోతుంది. భర్త హీనంగా...అత్తగారు చులకనగా చూస్తారు. భగవాన్ ఏం చేయాలి? లోలోపల కుంగిపోయింది.

"పిలిచావా అమ్మా?" కృష్ణమూర్తి గుమ్మంలోకి వచ్చి అడిగాడు.

"అవునురా? పిలిచాను. ఊ...కొత్త కొత్తని నేర్చుకుంటున్నావన్నమాట. విజయను మొదటి ఆట సినిమా చూపించి తీసుకురా. ఇంకా ఎందుకు నుంచుంటావు. అవతల సినిమా మొదలవుతుందేమో తొందరగా బైలుదేరు" అత్తగారు ఆజ్ఞయిచ్చినట్లే అంది.

విజయ బిత్తరపోయింది. అనుకోని యీ పరిణామానికి.

"అమ్మా...?"అయోమయంగా అన్నాడు కృష్ణమూర్తి.

"ఒరేయి నన్నేమీ ప్రశ్నించకు, వెళ్లమన్నాను. వెళ్లు నీకూ మళ్లీచెప్పాలా విజయా? పెద్దవాళ్లమాట అంటే లక్ష్యం లేదా ఏమి? ఊ...వెళ్లు"అందిగదమాయింపుగా.

పిల్లలా యిరువురు అవతలికి జారుకున్నారు.

"అమ్మను ఎలా ఒప్పించావు విజ్జీ?"కృష్ణమూర్తి అడిగిందానికి ఎలా జవాబు యివ్వాలో తెలియలేదు విజయకు. "తరువాత చెబుతాను. నా మీద నిజంగా ప్రేమవుంటే అడగవద్దు" అంది. కృష్ణమూర్తి ఏమి అనుకున్నాడో తిరిగి ఏమీ ప్రశ్నించలేదు. విజయ సినిమా కోరిక తీరింది.

ఓ రోజు విమల "విజయా! అత్తగారిని ఏదయినా అడగాలంటే నాకు భయం. మా మేనత్తగారి అబ్బాయి యీవూరు వచ్చాడు ఓ రోజు భోజనానికి పిలవాలని వుంది. కాని ఏం లాభం?" అంది దిగులుగా.

"ఆ విషయం నాకు వదిలేయి అక్కా," అంది ధీమాగా విజయ.

విమల మేనత్త కొడుకు ఓ రోజు వాళ్లింటికి వచ్చాడు. అదీ సాయంత్రం అయిదు గంటలవేళ. ఆ సమయంలో ఇంట్లో అందరూ టిఫెన్ తినేవేళ.

ఉప్మా ప్లేట్లల్లో సర్దుతూ అత్తగారితో అంది విజయ "టిఫెన్ టైమ్‌కు వచ్చారు. టిఫెన్ పెట్టి పంపిస్తే సరి. ఏమంటారు అత్తయ్యా?"

"ఎప్పటినుంచో అనుకుంటున్నాను ఆ అబ్బాయిని భోజనానికి పిలవాలని. టిఫెన్ తిన్నావ్, పో అంటే బాగుంటుందా?!" అంది అత్తగారు.

మొగవాళ్లు భోజనాలు చేస్తున్న టైమ్‌లో విమల విజయతో అంది.

"విజయా! అత్తగారిమీద ఏమాత్ర



# దావణగేరె
బట్టలు

ది దావణగేరె కాటన్ మిల్స్ లిమిటెడ్–
...సాంప్రదాయముగా సమకాలిక సౌందర్యమును సమకూర్చుమను!

**mysore queen**
ప్రింటెడ్ వాష్-ఎన్-వేర్ కేంబ్రిక్స్

*MYSORE BEAUTY*
ప్రింటెడ్ వాష్-ఎన్-వేర్ కేంబ్రిక్స్

**Pushpanjali**
వాష్-ఎన్-వేర్ డైడ్ కేంబ్రిక్ వాయిల్స్

Thomas/DCM/11e Tel

ప్రయోగించావోకాని నా కోరిక తీర్చావు. భలే గట్టిదానివి.”

విజయ చిరునవ్వు జవాబుగా చిందించింది.

కొంచెం రోజుల్లోనే విజయ అత్తగారి చేత మంచి వినయవిధేయతలు కలది అనిపించుకుంది. కాని... లోలోపల తాను అంత మంచి అత్తగారిని మోసపుచ్చుతున్నానని బాధపడేది.

ఓ రోజు దూరపుచుట్టం ఒకామెతో అత్తగారు మాట్లాడుతూ కూర్చుంది. అటుగా వచ్చిన విజయ చెవులో తన పేరు వినపడి గోడపక్క ఒదిగినుంచుంది.

“మా చిన్నకోడలు ఉత్త గర్విష్ఠిది లాగుంది. పలకరిస్తే సరిగా పలకనేలేదు. ఇన్నేళ్ళు వచ్చి చెవులకా రింగులేమిటి? నా ముఖం? నువ్వయినా చెప్పకూడదటే? అయినా నీ అంతవి

చెవిలోమటుకు వింటుందా ?" ఆ వచ్చినావిడ యిలాగే యిష్టంవచ్చినట్లు వాగుతున్నది.

అత్తగారు ఏంజవాబు యిస్తుందో చూద్దామని విజయ అలాగే గోడకు అతుక్కుపోయి నుంచుంది. ఊ ... ఆ ... తప్ప అత్తగారి నోట్లోంచి ఒక్కపలుకు వూడి రావటంలేదు.

"కోడలు నీ మాట వినకపోతే కిష్టప్పచేత నాలుగు చివాట్లు వేయించరాదుటే; అయ్యో రామ. నీకే అంత తెలివి వుంటే నీ కోడలి ఆటలు ఎందుకు సాగుతాయి. దేనికయినా పెట్టిపుట్టాలి. పెద్దదాన్ని చెబుతున్నాను. డబ్బు దస్కం కాస్త జాగ్రత్త చేసుకో ఎందుకయినా మంచిది. ఆడదాని వంటిమీద బంగారం వుండటం ఎంతో రక్షణ. ఏదయినా నగలు చేయించుకో. ఆనక ఏమనుకొనీ లాభం లేదు." వచ్చినావిడ సలహాయిస్తూ కూపీ తీస్తున్నది సంసారం గురించి.

"నేనూ అదే అనుకుంటున్నాను". అన్న అత్తగారి మాట విని విజయ నిర్ఘాంత పోయింది. అప్పటికప్పుడు వాళ్లదగ్గరకు వెళ్లి నాలుగూ దులిపేద్దామనుకుంది. యిలాంటి కుచ్చితపు బుద్ధుల వాళ్ళతో మాట్లాడేకన్నా కీలెరిగి వాత పెట్టటం మంచిదని నోరు మూసుకుంది. సమయం కోసం చూస్తూ,

ఆ మర్నాడు అత్తగారు నగల బత్తుడికి కబురుచేయటం చూసి ...

"పాపం కొడుకుల సంపాదనతో, వచ్చిన ఆవిడ నీతి కథలో అత్తగారు ఎంత జాగ్రత్త పడుతున్నది. సమయం రావాలి చెప్పకపోను. యింకానయం యిప్పటిదాకా మోసపొయ్యాను. అత్తగారు ఉత్త బోళా మనిషి కష్టసుఖాలు తెలిసినది అనుకున్నాను. అంతా నటన". అనుకుంది విజయ.

ఆ సాయంత్రం ఆ వూరిలోనే వున్న చిన్ననాటి స్నేహితురాలు సరళ వచ్చింది, విజయను చూడటానికి.

"మా అత్తగారు ఊరికి వెళ్లారు కాబట్టి నిన్ను చూడటానికి వచ్చాను. ఆవిడ వూళ్లో వుంటే గుమ్మం కదలనీయదు. మా వారు కూడా ఆవిడతో వెళ్లారు. ఎన్నాళ్ల నుంచో నిన్ను చూద్దామన్న నా కోరిక భగవంతుడు యీనాటికి తీర్చాడు." అంది సరళ.

"అదేమిటే సరళా! ఒక స్నేహితురాలిని చూడటానికి యింత ఏతనపడాలా?" ఆశ్చర్యంగా అంది విజయ.

సరళ ఓ నిట్టూర్పు విడచి... లోకంలో అందరూ మీ అత్తగారంత మంచి. మీవారంత ప్రేమగాను. నీ అంత అదృష్టంతోనూ పెట్టి పుట్టవద్దూ ? మా ఇంట్లో తల నొప్పివస్తే పదిపైసల మాత్రకు, పావుగ్లాసు కాఫీకి గతిలేదు.

కాపురానికి వచ్చిన మొదట్లో అత్తగారి సంగతి తెలియక ఏదో చిన్నమాట అన్నాను. అది ఆవిడకు తప్పుగాతోచి ఆయనకు చాడీలు చెప్పి నన్ను కొట్టించింది. ఆ రాత్రి ఆయనతో మొరపెట్టుకున్న ఫలితం... మర్నాడు ఆయన మా అత్తగారితో "అమ్మా! సరళ నిన్ను నానా మాటలు అన్నదే ?" అని చెప్పారు. ఆవిడ తిట్లు. అప్పటినుంచీ ప్రతి చిన్న విషయానికీ నోరుమూసుకు వుండటం నేర్చుకున్నా. అయినా మధ్య మధ్య చివాట్లు తప్పటంలేదు. మనసు మార్చుకోలేక నిన్ను చూడటానికి దొంగచాటుగారావల్సి వచ్చింది." చెప్పింది సరళ.

విజయ తల గిర్రున తిరిగింది. సరళ చెప్పింది విని.

తరువాత యిద్దరూ ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు. విజయ అత్తగారు మధ్యలో విజయను పిలిచి సరళకు కాఫీ టిఫెన్ పెట్టించింది. సరళ వెళ్లేటప్పుడు విజయ సరళకు బొట్టుపెట్టి తాంబూలము, పళ్లు యిచ్చింది.

"విజయా! నా ఉద్దేశ్యం మీ అత్తగారి గురించి అపార్థం చేసుకుంటున్నావు అని ... లోకంలో ఎందరో కోడళ్లు ఎన్నిరకాలుగానో బాధపడుతున్నారు. ప్రతి చిన్న విషయం సీరియస్‌గా తీసుకొని సుఖానికి దూరంకాకు." అని సరళ వెళ్లిపోయింది.

ముసలావిడ, అత్తగారి సంభాషణ విన్న దగ్గరనుంచి విజయ అత్తగారితో సరిగా మాట్లాడలేక పోతున్నది. సరళ వెళ్లిం తరువాతఆలోచిస్తూ అలాకూర్చుండిపోయింది.

"ఇంటి ఖర్చులు చూడబోతే అయిదొందలు దాటడంలేదు. మిగిలిన డబ్బు అత్తగారు ఏంచేస్తున్నట్లు? అన్నీ లెక్క ప్రకారం చేయాలి. అలా అని దేనికీ లోపంలేదు. పండక్కు చీరలు, సాయంత్రం పూలఖాతా. నెలకు రెండు సినిమాలు, వారానికి ఓ తీపి పిండివంట. ప్రతిపనీ యాంత్రికంగా జరిగిపోవాల్సిందే. తోడికోడళ్లుయిద్దరూ పెరట్లో కూరల పాదులకు నీళ్లు అవీ పోయడం క్రమం తప్పకుండా చేయాల్సిందే. అంతవరకే ఒకరూపాయి కావాలంటే లెక్క చెప్పాల్సిందే. అత్తగారి మనస్తత్వం ఏమిటి? అసలా ముసలావిడతో ఆ సోదీమాటలేమిటి? నగలు చేయించుకోవాలని "ఆ బుద్ధి ఏమిటి ?" విజయ దీర్ఘాలోచనకు చటుక్కున బ్రేక్ పడింది అత్తగారి పిలుపుతో.

విజయ లేచి అత్తగారి దగ్గరకు వెళ్లింది. నగల కేటలాగ్ పట్టుకుని బత్తుడు రెడీగా వున్నాడు. విమలకూడా అక్కడే వుంది.

"విమలా! విజయా! మీకు ఏరకం గాజుల జతకావాలో చూసి చెప్పండి" అంది.

"యీ రకం గాజులు యిలాటి నెక్‌లెస్ నాకు యిష్టం" వెంటనే అంది విమల.

"యిప్పుడు దేనికి?" అయోమయంగా అంది విజయ.

"తొందరగా చెప్పు, తరువాత మాట్లాడుకోవచ్చు" అనగానే యాంత్రికంగా తనకు తోచిన మోడల్ చెప్పింది విజయ.

"ఏమయ్యా బత్తుడూ ? చూశావుగా మా కోడళ్ల సెలెక్షను. ఆ నగలు ధరిస్తే మరింత అందం రావాలి కోడళ్లకు" అంది అత్తగారు.

/ ఆ రోజంతా పరధ్యానంతో గడిపింది. విజయ. అత్తగారి గురించి తన ఆలోచన తప్పు



ఏలూరులో అక్కినేని నాగేశ్వరరావు ప్రభృతుల సమక్షంలో నృత్యం చేసిన కుమారి శాంతరావు.

# ఇంటింటి చిట్కాలు

## మరకలు ఎలా పోతాయి?

### మరకలు

మనవద్దగల కొన్ని విలువైన బట్టలకు ప్రమాద వశాత్తూ ఏదోమరకలు అవుతూ వుంటాయి. అట్లా మరకలు పడటంవలన ఆ బట్టలు అందవిహీనమవుతాయి. కనుక మరకలను తొలగించే విధానాలు తెలుసు కోవటం అత్యంత అవసరమై యున్నది.

*** లిప్‌స్టిక్ మరక :**

1. మరక చిన్నదైనచో కార్బన్‌టెట్రా క్లోరైడ్‌లో ముంచి మరకపై మెల్లిగా రుద్దిన చాలును.

2. మరకకు రెండు చుక్కలు ఆలివ్ నూనెపూసి రుద్ది, పిదప కార్బన్‌టెట్రా క్లోరైడ్‌తో శుభ్రపరచిన మరక పోవును.

*** తాంబూలపు మరకలు :**

పొటాషియం పెర్మాంగనేటుకు కొద్దిగా నీటిని కలిపిన ఏర్పడు ఊదారంగు ద్రావణము తాంబూలపు మరకలపై వేసి రుద్ది తర్వాత సబ్బుతో ఉతికిన మరక పూర్తిగా పోవును.

*** త్రుప్పు మరకలు :**

కొద్ది మరకలైతే నిమ్మరసం, ఉప్పు వేసి రుద్దిన పోవును.

పెద్దమరకలైతే కిర్సనాయిల్‌లో నానబెట్టి తేజహరికామ్లము రెండు చుక్కలు వేసి, వెంటనే బోరాక్సు పొడివేసి రుద్ది నీటిలో ఉతికి ఆరవేసిన మరకలు పోవును.

— జి. లక్ష్మీకాంతం.

## ఇల్లాలికి ప్రత్యేకం

★ అద్దం తళతళామెరవాలంటే, సున్నంరాసి, వెంటనే గుడ్డపెట్టి తుడిచేస్తే కొత్తదిలావుంటుంది.

★ పిల్లలకు పాములాంటివి అలిగాతింటే, వాటిని కక్కించటం చాలా ముఖ్యం. గ్లాసెడు వెచ్చని నీళ్ళలో రెండు పెద్దచెంచాల ఉప్పువేసి త్రాగిస్తే పిల్లలకి వాంతి అవుతుంది.

★ పేస్టు అయిపోంగానే, ట్యూబులు అవతల పారవేస్తాం. మూతగట్టిగా బిగించి కొంచెం వెచ్చ చేస్తే అవి మళ్ళీ నిండు ట్యూబులు లాగాకని పిస్తాయి. ఇవి పిల్లలకి ఆడుకోటానికి యివ్వండి.

— శ్రీమతి వి. ప్రభామూర్తి.

## ముందుగా తేనె

★ బజార్లో కొన్న తేనె కాకుండా, పట్టుతేనె రోజూ మధ్యాహ్నం కొంచెం ముఖానికి రాసి, 1 గంట తర్వాత గోరువెచ్చని నీటితో కడిగి వేయండి. ముఖంపైవున్న నలుపుమచ్చలు, మొటిమలు పోతాయ్.

★ ఉబ్బసంతో బాధపడేవాళ్ళు రాత్రిపూట 1 కప్పు వేడినీటిలో 1 చెంచా తేనెవేసి నోరు పట్టే వేడి త్రాగండి.

★ పాటలుపాడేవాళ్ళు, కంఠ శ్రావ్యతకోసం 1 గంట ముందుగా 1 చెంచా స్వచ్ఛమైన తేనె పావు చెక్కనిమ్మకాయి రసంతో వారం రోజులు వాడితే గుణం కన్పిస్తుంది.

★ గుండెదడ, నీరసం వున్నవాళ్ళు రోజూ ఉదయం భోజనంతోబాటు 4తు.తేనెవాడండి.

★ మలబద్ధకమున్నవాళ్ళు రోజూ కాఫీకి బదులు 2 చెంచాలు తేనె వేన్నీళ్ళల్లోనేసి త్రాగండి.

★ కళ్ళకలకలు, మసకలు, వున్నవాళ్ళు 1 స్పూను తేనెను 10 ని. 1 కప్పునీటిలో మరగ బెట్టి కళ్ళల్లో ఒక చుక్కవేయండి.

★ క్రొత్తతేనె, నీరుల్లిపాయ రసము కలిపి నెలకి రెండుసారి తలకి పట్టించి వెంటనే స్నానం చేస్తే నల్ల వెంట్రుకలు రావచ్చు.

—కె. సత్యనారాయణమూర్తి.

అయింది. "పిచ్చి పిల్లల్లారా ఆకుల చాటు పిందెల్లాంటివారు మీరు. మీకేం తెలుసు?" అన్నమాట పదేపదే గుర్తుకు వస్తున్నది. మనసులో ఏవిషయము ఎంతకూ దాచుకోలేని విజయ అత్తగారి దగ్గరకు వెళ్ళింది.

"మీరు నన్ను పొరపాటుగా అర్థంచేసుకోక ఒకటి అడుగుతాను నిజం చెప్పండి. నిన్న ఆ ముసలమ్మతో మీరు అన్నమాట విన్నాను. ఆవిడ అనే మాటలకు మీరెందుకు అడ్డం తగలలేదు?" అంది విజయ.

"ఆ ముసల్ది ఏదో దూరపు చుట్టరికం. గుణము, నోరు, కన్ను, దృష్టి ఏదీ మంచిది కాదు. పచ్చగా వుంటె ఓర్వలేక ఆ కాపురాన్ని కూల్చిందాకా నిద్రపోదు. ఆవిడ చూపు దేని మీదన్నా పడిందా అది భగ్గున మండి పోవాల్సిందే. అందుకే నోరు మూసుకునిచల్లగా పంపించాను" అంది అత్తగారు.

అత్తగారి మాటలు వినంగానే విజయ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తనుచాటుగా విన్న మాటలు చెప్పేసింది. అర్థంచేసుకోకుండా

## కొత్త కోడలు

అడిగినందుకు పశ్చాత్తాపం ప్రకటించింది.

"అది నీతప్పు కాదు విజయా! ఒక్కోసారి మన చెవులు, కళ్ళు మననే మోసగించు తాయి. ఓర్పుగా వున్నప్పుడు, అనుభవాలతో తల పండి నప్పుడు మాత్రమే అన్నీ తెలుస్తాయి. నా మటుకు నాకు యీనాటికి ఎన్నో తెలిసాయి. చిన్నప్పుడే కాపురానికి వచ్చి అత్తగారి చేతిలో నానా బాధలు పడ్డాను. ఆయన చూడబోతే నోరులేని దేముడు. అనుభవించే రోజుల్లో మంచి వయసులో వున్నప్పుడు జీవితంలో ఏదీ అనుభవించలేదు. బాధలు తప్ప.

పుట్టెడు అప్పులుచేసి పోయారు అత్త గారు. అప్పులు ఎలా తీర్చామో, అబ్బాయి లిద్దరినీ చదివించి ఎలా పెద్దచేశానో దేముడికి ఎరుక. రత్నాలు లాంటి బిడ్డలను ముత్యాలలాంటి కోడళ్లను యిచ్చి భగవంతుడు యీనాటికి నా కోరిక తీర్చాడు.

యీ విషయంలో ఒక్కోసారి మీ కోరి కలకు నేను అడ్డం తగలవచ్చుకాని ... నాకు మీకన్నా ఎవరు వున్నారు? అధిక ధరలు ఆకాశాన్ని అంటుతున్న యీ రోజుల్లో నలుగురు పిల్లల తల్లులయిన తరువాత దుబారా సంసారం అయితే మీకు మిగిలేది ఏమిటి? అందుకే సంసారం ఒక త్రాటిమీద నడిపిస్తూ పొదుపుగా వుండి పదివేలు దాచాను. దానిలో మీ నగలకు అయిదువేలు తీసాను."

మాములు ప్రకారం ఆవిడ ధోరణిలో కామా పులిస్టాపులు లేకుండా చెప్పుకు పోయింది అత్తగారు.

"జీవితంలో మీ మాటకు ఎవరమూ జవదాటము అత్తయ్యా! యీ సంసారానికి మూలవిరాట్టు మీరు." అంది విజయ సంతోషము పశ్చాత్తాపము కలగా పులగంగా. "ఉత్త పిచ్చి పిల్లవు." అంటూ ప్రేమతో దగ్గరకు తీసుకుంది అత్తగారు విజయను.



(గత సంచిక తరువాయి)

## 38

రవీంద్ర, శరత్ లిద్దరూ లతని 'ఆంటీ' అంటూ పిలుస్తున్నారు కాబట్టి వందన కూడా లతని అలాగే పిలుస్తోంది.

ఆ రోజు లత ఉత్తరం రాసింది వైజాగ్ వస్తున్నట్లు.

లత ఎప్పుడు వచ్చినా రాధాకృష్ణ ఇంట్లోనో, ఆనంద్ ఇంట్లోనో దిగుతుంది. లత వస్తే సాధారణంగా అందరూ కలసి సినిమాకో, పిక్నిక్‌కో వెడతారు. అలా వీళ్లేని రోజు పిల్లల్ని తీసుకుని లత బీచ్‌కి వెడుతుంది. పిల్లలందరికి లతంటే ఇష్టం.

ఆ రోజు పన్నెండు దాటినా ఇంకా రాలేదు లత. కంగారు పడిపోతున్నారు ఆనంద్, రాధాకృష్ణ. అటు ఆనంద్ కంగారు చూసి సుశీల, ఇటు రాధాకృష్ణ కంగారు చూసి శారద ఒకటే వేళాకోళం చేస్తున్నారు. శారద కసలు ఒళ్లు మంటగాకూడా వుంది.

"ఏమిటా కంగారు? ఇవాళ రాకపోతే రేపొస్తుంది. ఏమిటా విచిత్రం?" అంటూ శారద గద్దించింది. ఆ అదలింపులు మామూలయిపోయాయి రాధాకృష్ణకి. అతను పట్టించుకోడు.

సుశీల అలా అదిలించదు ఆనంద్‌ని. ఆవిడ భయం వందన తనకు దూరమవుతుందని. అంతే. ఎటుపోయి ఎటుతిప్పినా లత రాక అటు శారదకి గాని, ఇటు సుశీలగ్గాని అంతగా నచ్చలేదు. అయినా వారికి నచ్చడం, నచ్చకపోవడమన్న ప్రశ్నేలేదు. లత వస్తుంది. వచ్చితీరుతుంది. వందనని చూడాలి. వందనని చూశాక వెళ్లిపోతుంది. ఎప్పుడు వచ్చినా ఒక్క రోజుకన్న ఎక్కువ వుండదు.

లత మోహన్‌ని ఎంత గాఢంగా ప్రేమించి, ఆరాధించిందో కృష్ణకీ, ఆనంద్‌కి తెలుసు. వందనలో మోహన్‌ని చూసి తృప్తి పడుతున్న సంగతి కూడా తెలుసు. అందుకే లత రావడం వారికే మాత్రం అభ్యంతరం లేదు. ఇష్టం కూడాను. అదీకాక లత మంచి స్నేహితురాలు. ఆమె స్నేహ పాత్రత, మంచి తనం అర్థం చేసుకొన్నది వారిద్దరే. వీళ్ల ముగ్గురి స్నేహం చాలా గట్టిగా పునాదులు వేసుకుని నిలిచింది. లతలో మోహన్‌ని చూసుకుంటున్నారు మిగిలిన ఇద్దరూ. బహువచన సంబోధన ఏకవచనంలోకి మారింది. ముగ్గురు కలిసి మోహన్‌ని గురించి ఆలోచించుకుని కలిసి కట్టుగా అతని దురదృష్టానికి విచారిస్తూ వుంటారు.

మొదట్లోనే పసి గట్టింది లత. తన రాక శారదకి, సుశీలకి ఇష్టం లేదని.

ఆసంగతే ఆనంద్‌తోనూ, రాధాకృష్ణతోనూ అంది ఓ రోజు.

"నువ్వలా అనుకోకు లతా ఎప్పుడూ? అటువంటి వాటిగురించి ఆలోచించి మనసు పాడుచేసుకోకు. చిన్న విషయాలవి. నీ మూలంగా ఎవ్వరికీ హాని జరగదని మా ఇద్దరికీ తెలుస్తే చాలు. ఇంకెవరినీ నువ్వొప్పించక్కర లేదు" ఆనంద్ ఆర్ద్రంగా చూస్తూ అన్నాడు.

"అవును లతా. స్వల్పవిషయాలగురించి పట్టించుకోకు. ఎవ్వరినీ నువ్వు నొప్పించలేవు కూడా." రాధాకృష్ణ అన్నాడు.

ఆ తర్వాత ఆ విషయం గురించి లతెప్పుడూ ప్రస్తావించలేదు. లత ప్రవర్తన చూసిన సుశీల మనసు మెల్లగా మారింది. మనసులో పట్టిన దుమ్ము మెల్లగా వదల సాగింది లత విషయంలో. శారదకీ అంతే.

'ఇంతకీ ఈ రోజు వస్తానన్నలత ఎందుకు రాలేదు?' ఆనంద్‌కి, కృష్ణకీ కంగారుగా వుంది.

"ఓ సారి కాకినాడ వెళ్లిరానా?" అడిగాడు కృష్ణ.

"సాయంత్రం దాకా చూద్దాం. ఆ తర్వాత ట్రంక్ కాల్ చేద్దాం" అన్నాడు ఆనంద్.

సాయంత్రం వచ్చింది లత.

"నువ్వు రాలేదేమో అని కంగారుపడి పోతున్నాం" ఆనంద్ అన్నాడు గుమ్మంలోంచే.

"ఉండండి. మీ కంగారుమీదే. లోపలికి రానీండి లతని" అంది సుశీల.

"ఆంటీ" అంటూ వందన ఎదురొచ్చింది. "కులాసా?" అంది లత వందన భుజం మీద చెయ్యేసి.

"ఊఁ" అంది వందన నవ్వుతూ.

"స్నానంచెయి లతా. నే నింతలో కృష్ణకు ఫోన్ చేస్తాను" ఆనంద్ ఆఫీసు గదిలోకి వెళ్లాడు.

సుశీలతో, వందనతో కబుర్లు చెబుతూ లోపలికి వెళ్లింది లత.

ఫోన్‌చేసి భోజనాలు గదిలోకి వచ్చాడు ఆనంద్. లత కాఫీ తాగుతోంది.

"వాళ్లింట్లో దొంగలు పడ్డారట" సుశీల

**జరిగిన కథ : 13** రిట్రెంచ్‌మెంట్ వల్ల నిరుద్యోగి అయిన జూనియర్ ఇంజనీరు రాధాకృష్ణ డాక్టర్ శివరాం దగ్గర డ్రైవరుగా చేర్తాడు. డాక్టర్‌కి పక్షవాతంవచ్చి ఆయన కుటుంబం కాకినాడ వెళ్లిపోతుంది. మోహన్ ఆత్మహత్యా ప్రయత్నాన్ని వివరిస్తూ ఆనంద్ రాసిన జాబు అందుకున్న రాధాకృష్ణ వాల్తేరు వెళ్తాడు. మిత్రులు ముగ్గురూ కలిసి వ్యాపారం ప్రారంభిస్తారు. మోహన్ వివాహితుడని తెలియని లత అతనికి దగ్గరవుతుంది. రాధాకృష్ణ ద్వారా విషయం తెలుసుకొని మోహన్ జీవితంలో నుంచి తప్పుకోవడానికి నిశ్చయించు కుంటుంది. రాధాకృష్ణకి తిరిగి ఉద్యోగం వస్తుంది. కుసుమకి వచ్చిన సంబంధం రాధాకృష్ణ ఒకప్పుడు డ్రైవర్‌గా పనిచేశాడన్న వంకతో తప్పిపోయే పరిస్థితి వస్తుంది. మరో అయిదువేలు ఎక్కువయివ్వడానికి సిద్ధపడి రాధాకృష్ణ ఆ సంబంధాన్ని ఖాయపర్చుకు రావడం కుసుమకి చాలా బాధని కల్గిస్తుంది. అనుకున్న ముహూర్తానికి కుసుమ పెళ్లి డాక్టర్ శివరాంగారి అబ్బాయి రఘుతో జరుగుతుంది. రాజీ కొడుకుని తానే పెంచుకోడానికి నిశ్చయించుకుంటుంది లత. మోహన్ భార్య సావిత్రి ఆడపిల్లని కని కన్ను మూస్తుంది. భార్య మరణానికి తట్టుకోలేని మోహన్ ఎటో వెళ్లిపోతాడు. అతని కుమార్తెని ఆనంద్ దంపతులు పెంచుకుంటూ ఉంటారు. రాధాకృష్ణ ఉద్యోగానికి రాజీనామా యిచ్చి తిరిగి వ్యాపారంలో ప్రవేశిస్తాడు.

కబురందించింది అతనికి ఓ కప్పుకాఫీ ఇస్తూ.

"అరె."

"నిజం ఆనంద్. నేను లేను. బాబాయ్, పిన్ని, నాన్న, అమ్మ అందరూ మేడమీద పడుకున్నారు. పిల్లలంతా ఉక్కగా వుందని ఆరుబయట పడుకున్నారు చల్లిగాలికోసం. వెనకవైపునుంచి దూరారు దొంగలు. చడీ చప్పుడూ కాకుండా దోచుకు పోయారు."

"ఏమయినా పోయాయా ?" ఆతృతగా అడిగాడు.

"మెల్లిగా అడుగుతున్నావేమిటి ? చాలా పోయాయి. పది వేలుచేసేనగలు, పట్టుచీరలు. వెయ్యిరూపాయల కేష్" నిర్వికారంగా చెప్పుకు పోతోంది.

"పెద్ద మొత్తమే"

"ఊ...మొత్తం పెద్దదే. అందరూ దిగాలుపడి పోయారు. పోలీస్ కంప్లయింట్ ఇచ్చాం. వాళ్ళ వేసే ప్రశ్నలు, ఆ తతంగం ముగిసేసరికి ఇప్పటికయింది."

కృష్ణ వచ్చేశాడు.

"హలో...హలో. ఏమిటీ ఈ రోజింత ఆలస్యం?" విషయం విని నిర్ఘాంతపోయాడు.

"దిగులు పడకు లతా. అవే దొరుకుతాయి. పదండి. అందరూ అలా షికారెడదాం. ఇంటి దగ్గర శారద ఎదురు చూస్తోంది. అందరం వెడదాం...పదండి. పదండి" అంటూ తొందర పెట్టి అందర్నీ లేవదీశాడు కృష్ణ.

కలతపడ్డ లత మనసు కొంచెం కుదుట పడింది ఈ వాతావరణంలో.

## 39

"నాన్నా, నేను బి. ఇ. చదువుతాను" అన్నాడు రవీంద్ర ఆఫీసు గదిలో కూర్చుని పేపరు చదువుతున్న రాధాకృష్ణతో.

ఇంటర్ పరీక్షా ఫలితాలు వచ్చాయి ఆరోజే. రవి మొదటి తరగతిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ ఆనందంలో మునిగి వున్నాడు రాధాకృష్ణ. రవి మాటలు విన్న రాధాకృష్ణ ఉలికిపడ్డాడు ఏమిటీ ఇంజనీరింగ్. తనలాగే వాడు కూడా తయారవుతాడా ? అసలే ఉద్యోగాల్లేవు. ఇప్పుడు మరీ కష్టంగా వుంది. ఉద్యోగాలు దొరకడం. ఈ నిరుద్యోగ సమస్య మరో అయిదేళ్ళకి మరీ వికృత రూపం దాలుస్తుందా ? వాడు ఇప్పుడు బి. ఇ. చదవడ మెందుకు ? ఈ ఆలోచన అతనికి మొదటి నుండీ ఇష్టంలేదు.

"బి. యస్ సి. లో చేరకూడదూ. ఫిసిక్స్ మెయిన్ తీసుకుని." అడిగాడు లాలనగా కృష్ణ.

బేలగా మొహం పెట్టేశాడు రవి తండ్రి ప్రశ్న వినగానే.

"నాకిష్టం లేదు నాన్నా"

"కాదు రవీ. నువ్వెన్ను కున్న కోర్సుకి భవిష్యత్ లేదు బాబూ"

కొంత సేపటి వరకు ఏం మాట్లాడలేదు రవి.

"ఏమంటావు ?" రెట్టించి అడిగాడు రాధాకృష్ణ.

"మీకు కష్టంగావుంటే మానేస్తాను. మీరెలా చెప్తే అలాగే నాన్నా" అన్నాడు రవి వెళ్ళిపోతూ. శారద వంటింట్లోంచి వచ్చి ఈ సంభాషణ వింది. వెళ్ళిపోతున్న రవి మొహం చూసిన శారదకు మనసు చివుక్కుమంది.

"ఏమిటి మీరు ? జొత్తిగా మతిపోతు న్నట్టుంది. పిల్లాడిని అలా నిరుత్సాహ పరుస్తారెందుకు ? మీ బెంగేమిటీ అసలు ? ఉద్యోగం దొరకదనేగా ? పోనీలెండి. వాడూ ఏదో వ్యాపారం చేసుకుంటాడు వెధవ ఉద్యోగం దొరక్కపోతే. వాడికేదో టెలి కమ్యూనికేషన్స్ చదవాలనుంటే మధ్య మీరేమిటి వాణ్ని చిన్నబుచ్చుతారు ? చదువుకున్నవాళ్లం మనమే ఇలా పిల్లల ఇష్టాలు గమనించకపోతే ఎలాగ ? వున్నది ఇద్దరు. వాళ్ళకేది ఇష్టమో అది జరిపిద్దాం. మన కేమిటి డబ్బుకు ఇబ్బంది వుందా ఏమైనా? ఇంక మీరు మరో మాటనకండి" అంది శారద విసురుగా. టెలి కమ్యూనికేషన్స్. బాగానే వుంటుంది కోర్సు. అదీకాక శారద చెప్పినట్లు వాడికిష్టమైనట్లే చేస్తే సరి పోతుంది.

"రవీ" గట్టిగా పిలిచాడు రాధాకృష్ణ.

"ఏం నాన్నా ?"

"ఇలారా"

దగ్గరగా వచ్చాడు రవి. తండ్రి దగ్గర నుంచి వచ్చే మాట కోసం నిరీక్షిస్తూ.

రవిని చూసి "నీ ఇష్టం రవీ. నీవు ఇష్టపడిన కోర్సే చదువు. బి. ఇ. చదువు.



ఇంక నేనేం అనను సరేనా ?'' రాధాకృష్ణ అన్నాడు సుస్మితంగా. రవీంద్ర కళ్ళల్లో కోటి కాంతులు. ఆ మెరుపు చూసిన రాధాకృష్ణకు చాలా తృప్తిగా వుంది.

''థాంక్స్ నాన్నా'' అన్నాడు.

''నాక్కాదు. అమ్మకు చెప్పు'' అన్నాడు రాధాకృష్ణ.

''అబ్బ. నాకెందుకు ?'' సిగ్గుపడింది శారద.

''పోనీలే అమ్మా. నీక్కూడా చాలా చాలా థేంక్స్'' అంటూ సంతోషంగా వెళ్ళిపోయాడు రవి, స్నేహితులతో పండుగ చేసుకోడానికి.

''వాడి సంతోషం చూశావా శారదా ?''

''మరి. సంతోషం కదూ''

''నీ కున్న ఆత్మ విశ్వాసం నాకు లేదు శారదా. అవసరంలో, అంటే సమయానికి నేను తప్పటడుగు వేసేటప్పుడు దిద్దుతావు. ఇంతకంటె నాక్కావలసిందేమిటి. చెప్పు''

''చాల్లెండి పొగడ్తలు''

''శారదా, ఇలా దగ్గరకురా''

''అబ్బా. ఏమిటది చిన్న పిల్లాడిలా'' సిగ్గుపడుతూ లోపలికెళ్ళిపోయింది శారద.

## 40

కస్సల్లింగ్ గదితలుపు లోసి లోపలి కడుగు పెట్టింది లత. ఆ పక్కన కుర్చీలో ఎవరో కూర్చున్నారు. ఎవరబ్బా? అనుకుంది లత. చెప్పుల శబ్దం, తలుపు శబ్దం విని అతనూ గుమ్మంవైపు చూశాడు. ఎవరు? ఎవరు? లత మస్తిష్కం అతివేగంగా పని చేసింది ''ఎవరు మోహన్?''అంది అత్యంతాశ్చర్యంగా. ఆమె గుండె విపరీతంగా కొట్టుకుంటోంది.

''గాడ్ ! మీరా ?''

''అమ్మయ్య. గుర్తుపట్టావా లతా? బ్రతికాను. గుర్తుపట్టలేవేమో అనుకున్నాను'' అన్నాడు మోహన్ నవ్వుతూ.

''అబ్బ ! మోహన్ మీరేనా ? ఎప్పుడొచ్చారు ? ఎంతమార్పు మీలో''అంది లత కుర్చీలో కూర్చుంటూ. అతి సంతోషంలో ఆమెకి మాట సరిగా రావడం లేదు.

''నిజంగానే మారానా లతా ?''

''మార్పా ? మెల్లగా అంటారేం ... ఆ... చెప్పండి వైజాగ్ వెళ్ళారా ? పాపను చూశారా ?'' అంటూ ఏమేమో ప్రశ్నలడుగుతోంది. ఆమెకి చాలా ఆనందంగా వుంది.




పట్టరాని సంబరం అణువణువునా విరుస్తోంది. మోహన్... నిజంగా మోహన్ వచ్చాడు అంటోంది లత మనసు.

''నేను నీ దగ్గరకు రావడానికి చాలా గుండె ధైర్యం తెచ్చుకున్నాను. ఎంతో భయపడుతూ వచ్చాను. ఎక్కడ తిట్టిపోస్తావో నని'' అంటూ నవ్వాడతను.

లేచి''బలేవారే...పదండింటికి వెడదాం'' అంది.

లత వెనకే అడుగులు వేశాడు.

ఆ రోజు లత ఇంటినిండా జనం వున్నారు. అయినా లత అతన్ని మేడమీదకి తీసికెళ్ళింది. శివరాం గది తీసే వుంది. అంటే తండ్రి గదిలో ఉన్నాడన్నమాటే.

''రండి. నాన్నగారిని పరిచయం చేస్తాను'' ఏదో చదువుకుంటున్న శివరాం లతని చూడగానే.

''ఏమ్మా'' అన్నాడు పుస్తకం మూసి.

''నాన్నా. అప్పుడు చెప్పానే మోహన్. సరే. కృష్ణా, ఆనంద్, ఈయన మంచి స్నేహితులు. తెలుసుగా'' నమస్కారం పెట్టాడు మోహన్.

''వాళ్ళ స్నేహం తెలియక పోడమేమిటే ? రండి మోహన్. ఇలా కూర్చోండి. చూడమ్మా భోజనం ఏర్పాటు చూడు. మేం మాట్లాడుకుంటూ వుంటాము. అన్నట్లు మీ సామాను ఏదీ''

''క్లోక్ రూములో పెట్టానండీ''

''అరరే...అదేమిటి. అమ్మాయ్ వారిక్కడే వుంటారు. ఆ సామాను అదీ తెప్పించు''

''అలాగే''

* * *

ఆ రాత్రి భోజనాలయాక మేడ మీద బాల్కనీలో కూర్చున్నారు మోహన్, లత, డాక్టర్ శివరాం.

కొంత లోకాభి రామాయణం అయ్యాక డాక్టర్ లోపలికి వెళ్ళిపోయడు నిద్రపోతానంటూ.

''ఇప్పుడు చెప్పండి. ఎక్కడికి వెళ్ళారు? ఏమిటి విశేషాలు? ఒక్క ఉత్తరం రాయడానికేం? పాపం కృష్ణ, ఆనంద్ మీకోసం ఎంత బాధపడుతున్నారో తెలుసా? మీ రెప్పుడొస్తారా అని ఎదురు చూస్తున్నారు''

''ఊఁ...ఊఁ...తెలుసు...కాని లతా. అంతకన్న మరో ప్రాణి హృదయం రోజూ నాకోసం స్వాతి వానకు ముత్యపు చిప్పలా ఎదురు చూస్తోందని తెలుసు''

''అలాగనకండి''

''కాదా? లతా. చెప్పు''

మాట మార్చింది లత.

''మీరుముందు వైజాగ్ వెళ్ళి మీ పాపను చూడలేదేం ?''

''ఇంకా నా పాప ఏమిటి లతా ? ఆనంద్ పాప. అంతేనా ?'' లత కెందుకో ఆ సమాధానం రుచించలేదు.

''అయినా ...'' ఏదో అనబోయింది.

''వద్దు లతా. అదంతా గుర్తు చేయకు. అదంతా గుర్తు చెయ్యకు. ప్లీజ్. ఇక్కడికే నేను ముందు ఎందుకు వచ్చానో నువ్వు గ్రహించుకు తీరాలి''

ఏమిటో ఈ మాట తీరు ? అనుకుంది లత.

''మీ సంగతి చెప్పండి మోహన్. ఇన్నాళ్ళూ ఎక్కడున్నారు ?''

''ఆ సంగతులన్నీ చెపుతాను. నేను ముందు ఇక్కడికే వచ్చాను కదా! అందుక్కారణం

డాక్టర్ సలహాలకు ప్రశ్నలు పంపే వారు వారి సందేహం లోగడ సంచికలలో తీరిపోయిందేమో ఒకసారి పాతసంచికలు తిరగవేసి చూసి, మరీ తమ ప్రశ్నలు పంపటం మంచిది. —సం.






## మమతల వంతెన

నువ్వు తెలుసుకోవాలి. నువ్వు తెలుసు కోనట్లే నటిస్తే నేనే చెప్తాను. ఇక్కడ నాలుగు రోజులుంటాను. వైజాగ్‌కి టెలిగ్రాం ఇస్తే వాళ్ళూ వస్తారు''

''టెలిగ్రాం నేనే ఇచ్చాను''

''అరె ... చాలా సంతోషం.''

''మరి. వాళ్లిద్దరూ మీ కోసం ఎన్ని కళ్లతో ఎదురు చూస్తున్నారో మీకేం తెలుసు? మీరేమో హాయిగా ఇక్కడి కొచ్చే శారు.'' అంది లత నిష్ఠూరంగా.

''అంటే నీకర్థంకాలేదూ? అక్కడి కన్న ఇక్కడే నాకు ఆకర్షణ ఎక్కువని'' అన్నాడు నవ్వుతూ.

ఏమిటీ మోహన్. ఇలా అంటున్నాడు? అతని ఉద్దేశం ఏమిటీ. ఛ. సర్దుకుని సాధ్య మయినంతవరకు నిర్లిప్తంగా కూర్చుంది.

''సమాధానం చెప్పు లతా'' ఉద్వేగాన్ని అణుచుకుంటూ అడిగాడు మోహన్.

''మీరేం మారలేదు.''

''మారను. ఎలా మారతాననుకున్నావ్ లతా! ఇంపాసిబుల్. నువ్వు వినలేదూ పుట్టినబుద్ధి'' గంభీరతని తేలిగ్గా వేళాకోళం లోకి పట్టించేస్తూ అన్నాడు.

''చెప్పండి. ఎక్కడున్నారు ఇన్నాళ్ళూ'' మళ్లీ మాట మార్చింది.

''ఇదుగో. రేపు వాళ్ళు కూడా రానీ. అందరికీ కలిపే చెప్తాను. పురాణ కాలక్షేపం. అన్నట్లు నేను ఇక్కడ వుండటానికి నీకే మైనా అభ్యంతరమా?'' లేస్తూ అన్నాడు. ఆవలింత లొచ్చేస్తున్నాయి అతనికి.

''అదేమిటి? అభ్యంతరం ఏమీలేదు. కృష్ణ, ఆనంద్ ఎప్పుడు ఈ ఊరొచ్చినా మా ఇంట్లోనే వుంటారు. అదిగో ఆ గదిలో పక్కవేయించాను హాయిగా పడుకోండి'' అంది లత.

''గుడ్‌నైట్'' అన్నాడాగదిలోకి వెళ్లిపోతూ.

''గుడ్‌నైట్...మరి. ఒక్కమాట'' ఆగింది లత.

''ఏమిటి లతా?''

''ఎక్కడికీ పారిపోరుగా?'' చూపుడు వేలు అడ్డంగా వూపుతూ అడిగింది లత గట్టిగా నవ్వుతూ ''ఊహూ. ఏ సంగతీ అటో ఇటో తేలందే కదలను'' అని లోపలి కెళ్లిపోయాడు మోహన్.

## పాతికేళ్లనాటి కథ

పాతికేళ్లక్రితం కొన్న క్రిష్ణుడి బొమ్మ —
మట్టిది —
ఒక చెయ్యి విరిగినా
రెండోచేతితో అభయాస్త్రం మిస్తోనేవుంది —
పాతికేళ్లనాడు పొత్తిళ్లలో కేరింతలాడిన
కొడుకు —
చదువుకు తగ్గ వుద్యోగం లేకపోయినా
సంసార చక్రం తిప్పుతూనే వున్నాడు —
పాతికేళ్లక్రితం కష్టపడి నిలుపుకున్నకొంప—
శక్త్యానుసారం అద్దెరాళ్లను తెచ్చిపెడుతూనే
వుంది కానీ.... —
పాతికేళ్లనాటి స్వాతంత్ర ప్రాభవానికి
మేమూ కారణమంటూ
గద్దెలెక్కి
గరీబీ హటావో అన్నవారంతా
మమ్మ ఐదేళ్లకోసారి పనికొచ్చే
ఓటరుగా మాత్రం గుర్తిస్తున్నారు!!

— అదూరి సీతారామ్మూర్తి.

## 41

తెల్లవారి ఏడుగంటలవుతుండగా ఆనంద్, కృష్ణ వచ్చేశారు టాక్సీలో.

మోహన్, లత కాఫీ తీసుకుంటున్నారు తోటలో లాన్‌లో కూర్చుని. వీళ్లనిచూసి తాగుతున్న కాఫీ కప్పు బల్లమీద పెట్టేసి లేచి ఎదురు వెళ్లాడు మోహన్.

'మోహన్' అంటూ ఇద్దరూ షెరో వైపు నిలబడ్డారు. ముగ్గురిలో ఒక వింతయిన నంచ లనం. అదో అనుభవం. మాటలతో వర్ణించ లేనిది. మాట రాలేదు ఎవరికీ. ఒకరొకరు కళ్లతో చూసుకున్నారు.

ముందు కృష్ణ మాట్లాడాడు.

''మోహన్ ఎన్నాళ్లయిందిరా'' మోహన్ చేతిని తనచేతిలో తీసుకుని, నొక్కుతూ అన్నాడు రాధాకృష్ణ.

''మీ ఇద్దరూ బాగా చిక్కిపోయారు''

''అసలు. వీడు బ్రతుకుతాడనుకోలేదు'' అన్నాడు ఆనంద్ చూపుడువేలు రాధాకృష్ణ వైపు తిప్పి.

''ఛ. ఊరుకో. ఏమిటది?'' మందలిం చాడు రాధాకృష్ణ.

''రండి, రండి. కాఫీలు చల్లారి పోతున్నాయి'' లత పిలిచింది గట్టిగా.

''చెప్పరా, ఏమిటి నీ సాహస కృత్యాలు?'' ఆనంద్ అడిగాడు. (ఇంకా వుంది)

# నల్లకలువలు

కలువకొలను సదానంద

పెళ్ళి చూపులకు బయలుదేరబోతూ-అద్దంలో చూసుకున్నాడు సుందరం. ముక్కు పెద్దదిగా,

పెదవులు లావుగా వుండి, తన మొహం బాగాలేదేమో ననిపించింది.

తలకు చమురు రాసి దువ్వెనతో దువ్వుకున్నాడు. వెంట్రుకలు అణగలేదు. నీళ్లతో తడిపాడు వెంట్రుకల్ని. అప్పటికీ అణగలేదు. దువ్వుతూ వుంటే వాటి యిష్టంగా రేగిపోతూ వున్నై. పాపిడీ సరిగ్గా రాలేదు. వెంట్రుక లంతా బూరుగుపత్తి విడదీసినట్లు చిందర వందరగా రేగిపోయి, తల పెద్ద బుట్టలా కనిపించింది. తానొక భూతంలా వున్నానని పించింది. విసుగు పుట్టింది. మర్నాటి ఉదయమే కొండకెళ్లి పాడు వెంట్రుకల్ని తీయించి పారేయాలనుకున్నాడు. ప్రాణాన్ని విసిగించే ఈ క్రాపుకన్నా ఆ గుండే నయమని పించింది. గట్టిగా దువ్వి దువ్వి ప్రయోజనం లేక కోపంతో జుట్టుపీకి, దువ్వెన విరగ్గొట్టి, అద్దాన్ని గోడకేసి విసిరికొట్టాడు. ఒళ్లు తెలియని కోపమొచ్చింది. ఆ కోపంలో ఏడుపొచ్చింది.

... తాను బావున్నాడా లేడా అన్న సందేహం సుందరాన్ని చాలా కాలం నుండి పీడిస్తోంది. 'నేను బాగానే వున్నాను' అనుకుంటాడు, ఒక్కొక్కప్పుడు. 'అయ్యో నేనిలా వున్నానేంటి?'' అనుకుంటాడు మరొకప్పుడు. 'నేను బాగున్నాను, నాకు ఏమీ లోపం లేదు' అనుకొన్నప్పుడు. బలే మురిసి పోతాడు. గర్వపడతాడు. కాని-'నేను యిలా అసహ్యంగా వున్నానేమిటి?' అనుకొన్నప్పుడు దిగాలు పడిపోతాడు. చిన్నబోతాడు. ఎప్పుడూ — ఈ రెండు విధాల అనుభూతులే ఒకటి గెలవలేక, ఒకటి ఓడిపోలేక, పోట్లాడు కుంటూ వుంటై, అతని యువక హృదయంలో.

స్నేహితులంతా అంటుంటారు — తనకు ముక్కు పెద్దదనీ, పెదిమలు లావనీ, పార పళ్లనీ, దొంగ కళ్ళా అనీ ...

'ఏమి ఆకీవి! ...' అని ఒకడు,

'కంతుడో, జయంతుడో, నలకూబరుడో దిగివచ్చినయట్లు...' అని రెండో వాడు,

'గంగా తీరముల వంటి యా పెదవులు, హిమాచలము వంటి యా నాసిక ...' అని యింకొకడు.

'కైబరు బోలను కనుమల వంటి యా నాసికా రంధ్రములు...' అని మరొకడు.

'ఉత్తర దక్షిణములను జూపు ఆ కనుదోయి...' అని వేరొకడూ అభినయ పూర్వకంగా వర్ణిస్తూంటే — పగలబడి నవ్వుతారందరూ.

ఒక్కొక్కడు ఒక్కోరకంగా నవ్వుతాడు. ఒకడి నవ్వుకు, యింకోడి నవ్వుకూ పోలికే వుండదు. గుర్రం సకిలించినట్టు ఒకడు, కందిరీగ రొదచేసినట్టు ఒకడు, కాకి అరిచి నట్టు ఒకడు, గాడిద ఓండ్ర పెట్టినట్టు ఒకడు, దున్నపోతు రంకె వేసినట్టు ఒకడు, నక్క ఊళపెట్టి నట్టు ఒకడు ... బోలెడు రకాలు! వాళ్లు నవ్వడం చూస్తే, నవ్వుల్లో కూడా జాతులూ, కులాలూ వున్నాయా అనిపిస్తోంది.

అంతా చూసి ఆగలేక తానూ ఘొల్లుమని నవ్వేస్తాడు, సుందరం.

... అలాంటి సందర్భాలలో 'పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణ సంకటం' అన్నట్లుగావుంటుంది అతనిస్థితి. తనమనస్సు ఎంత నొచ్చుకుంటుందో అని అయినా ఆలోచించరు, అవతలి వాళ్లు.

తనను చూచి పరిహసించడం దేనికి? అందరూ అందంగానే వుంటారా? ... మనిషి స్వశక్తితో సాధించుకుంటే వచ్చేదా, అందం?

అయినా—తాను వాళ్లలాగా అంత అందంగా లేకపోయినా, తనకున్న హృదయం వాళ్లకెక్కడ వుంది?... తన హృదయం మృదువైనది. ఒకరిని నొప్పించాలన్న బుద్ధులు లేవు దానికి. ఒకరి కష్టాన్ని చూస్తే జాలిపడుతుంది. సంతోషం పువ్వులై పూచేచోట నవ్వుల పల్లవి పాడుతుంది. ఎదుటివారి హృదయాన్ని బాగా అర్థం చేసుకుని దానికి అనుగుణంగా నడుచుకుంటుంది.

తనకు ముక్కు పెద్దదైతేనేం, పెదవులు లావైతేనేం, పళ్లు ఎలా వుంటేనేం... తన హృదయం సుందరంగా వుంది. అది చాలు తనకు! మనిషికి హృదయ సౌందర్యం కావాలి గానీ, బాహ్యసౌందర్యం ఏం చేయను?




విసరికొట్టిన అద్దాన్ని చేతికందుకున్నాడు సుందరం.

అద్దం విరిగిపోలేదు!

* * *

ముహూర్తం దగ్గరపడుతూన్న కొద్దీ సుందరం గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. మళ్లీ అదే సందేహం!... తాను అందంగా లేడేమో?

మళ్లీ మాటిమాటికీ మొహం అద్దంలో చూసుకుంటాడు. ఫరవాలేదు. క్రాపు బాగానే వుంది. ముక్కు ఏమంత పెద్దదికాదు గానీ, కాస్త...అంతే! పెదిమలు ఏమంత లావు కావేమో? కొంచెం లావులేకుండావుంటుందా? అయినా పెదవులు లావుగా లేకపోతే ఏమందం? ... నవ్వినపుడు మాత్రం అదోలా వుంటుంది. గట్టిగా నవ్వకుండా పెదవులు బిగబట్టి సన్నగా, జాగ్రత్తగా నవ్వితే బావుంటుంది — అందంగానూ, స్టయిల్‌గానూ.

...ఇటువంటి సమాధానాలతో సంతృప్తి

పడినతరువాత పెళ్ళికూతుర్నిగురించి ఆలోచించడం మొదలెట్టాడు.

వాళ్ళూ మంచి కుటుంబంవాళ్ళే. తమలాగా పొలం పుట్రా దండిగా వున్నవాళ్ళే. వాళ్ళు యిస్తామన్నది... పెళ్ళికూతురి పేర రెండెకరాల మాగాణీ, ఐదువేలు విలువచేసే నగలు, తనకు పదివేల రూపాయలకట్నం, ఇంకా ఏవేవో వస్తువాహనాలు!



అమ్మాయి పేరు అపరంజి! పల్లెటూరి వాతావరణంలో పుట్టి పెరిగిన పిల్ల. ఈ సంబంధానికి అమ్మ మొదటఒప్పుకోకపోయినా, నాన్న బలవంతం మీద తర్వాత ఒప్పుకోక తప్పింది కాదు.

ఎవరికి ఎలా వున్నా, తనకు మాత్రం అమ్మాయి నచ్చింది. పెళ్ళిచూపుల్లో తనకేసి చూట్టానికి సిగ్గుపడుతూ ఆమె నవ్విన చిరునవ్వును తాను మరిచిపోగలడా ?

* * *

పెద్దలు నిశ్చయించిన శుభముహూర్తాన అపరంజి సుందరానికి పెళ్ళాం అయిపోయింది.

...భయపడుతూ, సిగ్గుపడుతూ, అడుగులో అడుగువేసుకుంటూ పడకగదిలోకి వచ్చిన అపరంజి చేయిపట్టుకొని పక్కన కూచోబెట్టుకున్నాడు సుందరం. తన్మయుడై ఆమె ముఖంలోకి చూశాడు.

'అపరంజీ!' అంటూ తనవ్రేళ్ళతో ఆమె చుబుకాన్ని పట్టి పైకెత్తాడు.

అతని కన్నుల్లోకి చూసింది అపరంజి, బెదురుగా.

'చూడు అపరంజీ! నేనెలా వున్నాను ? నీకు నచ్చానా?' అన్నాడు.

ఆమె సిగ్గుచేత మాట్లాడలేకపోతోంది.

'నేను బాగాలేనని చాలామంది అంటారు. నాకూ అలాగే అనిపిస్తోంది. నీకు ఎలా వున్నాను. చెప్పు అపరంజీ! ...'

ఆమె నిలకడగా అతని ముఖంలోకి చూసింది. అతని భుజాలమీద చేతులు వేసింది. అతని మొహాన్ని కళ్ళార్పకుండా కొన్ని క్షణాలు చూసింది. 'ఎవరండీ అన్నది, బాగా లేరని? మీకేం లోటు? లక్షణంగా వున్నారు!' అంది మెల్లగా. హృదయపూర్వకంగా అంది అలా అని. సుందరం సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోయాడు.

తనకింతకన్నా మరేం కావాలి ? తన కేమీ లోటు లేదని తన పెళ్ళామే అంది. అపరంజికి తాను అందంగా కనిపిస్తున్నాడు. ఇతరులతో తనకు నిమిత్తం లేదు.

'అపరంజీ!...' పిలిచాడతను.

'ఊఁ?'

మబ్బులు మూగిన చందమామలా వుంది ఆమె ముఖం.

'అలా వున్నావేం?'

'ఏమీ లేదు'

కాసేపు వూరుకుందామె.

'...మీ కంటికి నేనెలా వున్నానండీ ?'

'అలా అడుగుతున్నావేం ?'

'చెప్పండి'

'చాలా బాగున్నావు!'

'...నేను నల్లగా లేనూ?'

'అయితేనేం? అందంగా వున్నావు!'

'అందరూ నల్లగా—కాకిలా వున్నానంటారు' ఆమె కళ్లలో నీళ్లు తిరిగాయి.

ఆమె కన్నీళ్లు తుడిచాడు సుందరం. ఆమె కళ్లలో కళ్లు పెట్టి 'అపరంజీ! నీలో అసహ్యించుకోవలసింది ఏముందో నాకర్థం కావడంలేదు. నువ్వు నల్లగా వుంటేనేం? నా కంటికి ఎంతో అందంగా వున్నావు. ఆ నల్ల రంగే నీకు అందం!' అన్నాడు లాలసగా.

అప్పుడే వికసించిన నల్ల కలువలా కలకలలాడింది అపరంజి ముఖం.

సుందరం విసరికొట్టినా విరిగిపోనిఅద్దం—పరమగురువులా నవ్వుతూ ఆ గది గోడమీదనే వేలాడుతోంది.

---

# మరో ప్రేమకథ

(15 వ పేజీ తరువాయి)

మనుషులందరూ చెడ్డవాళ్లు కారు. మీరీ నిజాన్ని తెలుసుకోవడం అవసరం.''

''మా సంసారాన్ని గురించి చెప్పాను. జుగుప్సాకరమైన కుటుంబం మాది. అయినా నన్ను పెళ్లాడేందుకు మీరు సిద్ధంగా వున్నారా?'' నవ్వుతూనే అడిగింది మాలతి.

''మీకు పరిహాసంగా వుంటె నేనేమీ చెయ్యలేను. ఒక్క విషయం మాత్రం నిజం. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీ కుటుంబ వ్యవహారాలు మా పెద్దలకు అవసరమే అయినా—వారిని నేను ఒప్పించగలను. దురదృష్టమేమిటంటే, మీరే నన్ను నమ్మడం లేదు''అన్నాను నిస్పృహగా.

''మన్నించండి మధూ, నన్ను ఆలోచించుకోనివ్వండి''

ఇంతలో శేషాద్రిగారు వచ్చారు. తిరిగి పనిలో నిమగ్నమయ్యాము. సాయంత్రం నాలుగు గంటలకు పనిపూర్తయింది. మాలతీ నేనూ వాన్‌లో యింటికి బయలుదేరాము. ఆమెదిగి వెళ్లబోతుండగా అభిమానాన్ని చంపుకొని 'నాకు మీ యిల్లు చూపించరూ ?' అని అడిగాను. ఆమె కాసేపు తటపటాయించి 'రండి' అన్నది. డ్రైవర్ని వెళ్లిపొమ్మని చెప్పి ఆమెను అనుసరించాను.

నన్నొక గదిలో కూర్చోబెట్టి కాఫీ తెచ్చేందుకు లోపలికి వెళ్లింది మాలతి. ఇంట్లో యెవరూ వున్న అలికిడి లేదు. గోడకు తగిలించి వున్న ఫొటోలను చూస్తూ మాలతి కుటుంబంలోని వ్యక్తుల్ని అంచెనా వేసుకోనారంభించాను.

''ఇవి తీసుకోండి'' ప్లేటులో బిస్కట్లు తెచ్చి బల్లమీద పెట్టింది మాలతి.

''ఇవన్నీ చేస్తారనుకుంటే నేనసలు వచ్చేవాణ్ణి కాదు.''

''ఫర్వాలేదు లెండి. ఇంటికివచ్చిన అతిథికి యీ పాటి మర్యాద చెయ్యలేని స్థితిలో లేను'' అంది నవ్వుతూ.

''మీతో యేమి మాట్లాడినా చిక్కే!''

''తింటూ వుండండి, కాఫీ తెస్తాను'!అని లోనికి వెళ్లబోయింది.

''మీ నాన్నగారు, పిన్ని...''

''నాన్న బయటికి వెళ్లినట్లుంది. పిన్ని యింట్లో వుంది.''

''నేను వచ్చినట్లు తెలిస్తే...''

''గొడవ జరగవచ్చు. అయితే మీ ముందు కాదు లెండి, మీరు వెళ్లాక''అని నవ్వుతూ లోపలికి వెళ్లింది. ఎందుకు వచ్చానా అని బాధ పడ్డాను.

కాసేపట్లో రెండు కప్పుల్లో కాఫీ తీసుకు వచ్చి నాకొకటి అందించి రెండోది తాను తీసుకొని నా కెదురుగా కూర్చుంది మాలతి.

''నేను వచ్చి మీకు ముప్పుతెచ్చి పెట్టాననుకుంటాను ?''

''మీరందుకు విచారించకండి. మీరు రాకపోయినా ఆ ముప్పు నాకు తప్పేదికాదు.''

''అంత హృదయంలేని మనిషా పిన్ని ?''

''చూస్తారా ?''

''చూద్దామనే వుంది, కాని యీ రోజు కాదులెండి.''

''మీ యిల్లెక్కడ ?''

''సుల్తాన్ పురాలో – మసీదు ప్రక్కన.''

మాలతి వాళ్ల పిన్నికాబోలు – మాలతిని పిలిచింది యింట్లోనుండి. కాని మాలతి కదలకుండా అలాగే కూర్చొని వుంది.

''మీ పిన్ని పిలుస్తున్నట్లుంది ''

''ఔను.''



మే 1 న జరిగిన ఆంధ్రపత్రిక, విజయవాడ కార్యాలయ సిబ్బంది వజ్రోత్సవ వేడుకల సభలో ఉపన్యసిస్తున్న మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, వేదికపైన వున్నవారు వరుసగా శ్రీయుతులు బాలాంత్రపు రజనీకాంతరావు (ఆకాశవాణి డైరక్టరు), మంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు, సభాధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య.

# మరో ప్రేమకథ




"నేను వెళ్తా మరి."

"మీ యిష్టం."

"మళ్లీ ఎప్పుడు కలుస్తారు ?"

"రేపు ఆఫీసులో."

ఆమెవద్ద సెలవు తీసుకొని యింటికి వెళ్లిపోయాను.

* * *

కమల్ టాకీస్‌లో 'లేత మనసులు' సినిమా ఆడుతోంది. చాలా బాగుందని ప్రక్కింటి వాళ్లబ్బాయి ద్వారా తెలుసుకున్న నానిగాడు వాళ్లమ్మను సినిమాకు తీసుకెళ్లమని గొడవ చెయ్యడం ఆరంభించాడు. పని తొందరలో వున్న వదిన నాలుగు అంటించింది. ఇంటి కప్పు యెగిరిపోయేలా యేడుపు మొదలెట్టాడు. నేను వాణ్ణి సముదాయించి సినిమాకు తీసుకెళ్తానని నచ్చజెప్పడంతో యేడుపు మానాడు. కమల్ టాకీసు మా ప్రక్కవీధిలోనే గనుక నేను, నాని కాలినడకనే థియేటర్‌కు చేరుకున్నాము. నానిగాడు సినిమా పోస్టర్లు చూస్తున్నాడు. నేను థియేటర్ ఆవరణలో పచార్లు చేస్తున్నాను. అంతలో హఠాత్తుగా మాలతి రిక్షా దిగుతూ కనిపించింది. నన్ను చూడగానే నా వద్దకు వచ్చింది.

"సినిమాకొచ్చారా ?" అని ప్రశ్నించింది. ఔనని తల వూపాను.

"మీరు ?"

"నేనుకూడా."

"ఎవరు బాబాయ్ యీమె ?" అంటూ ధర్మసందేహాన్ని వెలిబుచ్చాడు అక్కడికి వచ్చిన నానిగాడు.

"మీ పిన్నిరా." అన్నాను నవ్వుతూ.

మాలతి నానిగాణ్ణెత్తుకొని ముద్దాడింది. నేను వెళ్లి రెండు బాల్కనీ టిక్కెట్లు తెచ్చాను. థియేటర్లోకి వెళ్లి కూర్చున్నాము.

"నామీద నమ్మకం కుదిరిందా ?" అని అడిగాను "మీమీద నమ్మకం కుదిరిందిగానిమన పెళ్లి జరుగుతుందన్న నమ్మకమే కుదరలేదు"

"ఎందుకని ?"

"బహుశామీవాళ్లు అంగీకరించకపోవచ్చు."

"అటువంటి అనుమానాలు పెట్టుకోవద్దు. అన్నట్లు నేను మీ యింటికి వచ్చిన రోజు గొడవ జరిగిందా?"

"జరిగింది. పిన్ని నాన్నతో చెప్పింది. మీరెవరని నాన్న నన్నడిగాడు. అంతా వివరంగా చెప్పాను. ఏమనుకున్నాడో యేమో, మాట్లాడకుండా వూరుకున్నాడు."

సినిమా మొదలయింది. నా దృష్టి తెర మీద లేదు. మెల్లగా మాలతి చేతుల్ని నా చేతుల్లోనికి తీసుకున్నాను. ఆమె అభ్యంతరం చెప్పలేదు.

"మాలతీ!" గొణిగాను.

"ఆఁ!"

"నేనంటే నీ కిష్టమేగదూ !"

ఆమె బదులు చెప్పలేదు. నాపైకి వాలి తన బుగ్గల్ని నా చెంపకానించింది.

"నన్ను నిజంగా పెళ్లి చేసుకుంటారా ?

"ప్రమాణం చెయ్యనా ?"

"అక్కర్లేదు. మీ మీదనమ్మకముంది."

మూడు గంటల సినిమా మూడు నిముషాల్లో అయిపోయినట్లనిపించింది. మాలతిని రిక్షా యెక్కించి 'గుడ్‌నైట్' చెప్పి నానిగాడితో యింటికి తిరిగి వచ్చాను. మా యిద్దరికీ అన్నం పెట్టింది వదిన. నానిగాడు హుషారుగా సినిమా ఘట్టాలు వర్ణించి చెబుతున్నాడు. వదిన నవ్వుతూ వింటోంది.

"అమ్మా, మనకు పిన్నివుంది తెలుసా ?"

హఠాత్తుగా అన్నాడు నాని.

నాకు పచ్చి వెలక్కాయ గొంతులో అడ్డం పడ్డట్లయింది. గుడ్లప్పగించి వాడివేపే చూడసాగాను.

"పిన్నేమిట్రా నీ ముఖం ?" అందివదిన.

"నిజ్జంగా ! సినిమాకి వచ్చింది పిన్ని. బాబాయిని యెంత పిలుస్తున్నా పలకకుండా పిన్ని చేతులు పట్టుకొని కూర్చున్నాడు."

"తరువాత సిగ్గుపడుదువుగాని, భోంచెయ్యి ముందు" కర్కశంగా వినిపించింది వదినకంఠం. ఎలాగో భోజనం ముగించి నా గదిలోనికి వచ్చి లైటార్పివేసి పడుకున్నాను. నానిగాణ్ణి మింగేయాలన్నంత కోపంగా వుంది. వదిన నన్ను యెంత నీచంగా వూహించుకుంటోందో! ఇప్పుడేమిటి చెయ్యడం? ఎలా నచ్చచెప్పడం?

"అప్పుడే పడుకున్నావా!" అంటూ లైటు వేసింది వదిన నాగదిలోనికి వచ్చి. నేను లేచి కూర్చున్నాను.

"నానిగాడు చెప్పింది నిజమేనా ?" –

"... ... ... ..."

"ఎవరా అమ్మాయి ?"

చెప్పాను. వదిన కాసేపు ఆలోచించింది.

"రేపు యింటివద్ద వుంటుందా ఆ అమ్మాయి ?"

"ఉంటుంది. రేపు ఆదివారంగదూ !"

"సరే, నేను రేపు వెళ్లి విచారించి వస్తాను. మనకు సరిపడే సంబంధమైతే పెళ్లి చేసుకుందువుగాని." అని లైటార్పి వెళ్లిపోయింది.

ఆ రాత్రంతా నాకు సరిగా నిద్రపట్టలేదు. వాళ్ల యింటి వ్యవహారాలు విచారించిన మీదట వదిన యీ పెళ్లికి వొప్పుకొనకపోతే యేం చెయ్యాలి ? మాలతిలో యెన్నో ఆశలు చిగురింపజేశాను. ఆలోచిస్తూ చాలా ప్రొద్దు పోయేవరకూ మేలుకొనే వున్నాను. ఆలస్యంగా నిద్రపోవడం చేత ప్రొద్దెక్కి నిద్రలేచాను. నేను లేచేసరికి వదిన యింట్లో లేదు. బాత్‌రూం వద్దకు వెళ్లాను. పంపువద్ద నీళ్లతో ఆడుకుంటున్న నాని నన్ను చూడగానే బెదిరిపోయి వాళ్ల నాన్నవద్దకు పరిగెత్తాడు. స్నానంచేసి కాఫీ పెట్టుకొని తాగి హాల్లో అన్నయ్య ప్రక్కనే కూర్చున్నాను. అంతలో వదిన వచ్చింది

"మామయ్యకు వుత్తరం వ్రాయండి." అంది అన్నయ్యతో.

"నిన్ననేగదా వ్రాసింది !" ఆశ్చర్యంగా అన్నాడు అన్నయ్య.

"మళ్లీ వ్రాయండి. మధుకు సంబంధాలేవీ చూడొద్దని వ్రాయండి."

"ఏం? నువ్వు చూశావా ?"

"మీ తమ్ముడే చూసుకున్నాడు లెండి."

అన్నయ్య నావేపు అయోమయంగా చూశాడు. సిగ్గుతో తల ముక్కలౌతూ నేనక్కణ్ణుండి జారుకున్నాను. వదిన అన్నయ్య ప్రక్కన కూర్చుంది అసలు విషయం చెప్పేందుకు.

వంటింట్లో చెక్కెర డబ్బా మూత తీసేందుకు విశ్వప్రయత్నం చేస్తున్న నాని నన్ను చూడగానే బయటికి పరిగెత్తబోయాడు. నేను వాడికా అవకాశం యివ్వకుండా వాణ్ణెత్తుకొని ముద్దులతో నింపేశాను.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

ఈ కవరు మీద 'స్వంత చిరునామా' బదులు
వేరే పత్రిక అడ్రస్సు
రాసాడేమిటోర్!

ఎడిటర్

శశిధర్






# ••● సంతోషమే సగము బలము ●••

— ఆc! ఏంలేదు.. ఈ క్యూ నా దాకా వచ్చేలోపున
రేషనింగ్ సరుకుల ధర మరింత పెరిగిందం
టారేమోనని ఉబ్బులు చూసు
కుంటున్నా....!

చౌక
డిపో

— తులసీరాం



# యువతి లాగే ఉండాలని అభిలాషపడే యువతికి

తయారీదారులు :

హిండన్ రివర్ మిల్స్

భారత దేశంలోని అత్యంత ఆధునికమైన పాలి మిల్లు.

చీరలు

DCM TEXTILES

రుబియా మరియు ఫుల్ వాయిల్ చీరలు

mcm/dcm/ 968